విశ్వసాహిత్యమాల ౧౨



# లెనిన్ ఉపదేశాలు

హామీ దత్తు



మార్చి 1946



—రామమోహన్.



వి. ఐ. లెనిన్.

## ఒకటవ ప్రకరణము.

# లెనిన్ యొక్క కాలం.

లెనిన్ 1870 లో పుట్టేడు. 1924 లో మరణించేడు. ఈవిధంగా అతని జీవితం 19 వ శతాబ్దపు ఆఖరుపాదాన్నీ 20 వ శతాబ్దపు మొదటి పాదాన్నీ ఆవరించియున్నా అతని విప్లవ కార్యక్రమం 19 వ శతాబ్దపు ఆఖరుపదిలో ఆరంభం అయి 20 వ శతాబ్దపు మొదటిపాదాన్ని అంతనీ ఆక్రమించింది.

ఈసమయంలో మానవచరిత్రలో తీవ్రమైన మార్పులు జరిగేయి. అది ఒక పరివర్తన యుగం. 1914 నాటి ప్రపంచయుద్ధం, 1917 నాటి రష్యను విప్లవము ఈ మార్పును స్పష్టంగా సూచిస్తూన్నాయి. వాటిని పట్టే ఆయుగ పరివర్తనాన్ని మనం గుర్తించగలుగుతూన్నాము. "లెనిన్" యొక్క జీవితానికీ, ఈపరివర్తన యుగానికీ, వేరు చేయరాని పెద్దసంబంధం వుంది.

19 వ శతాబ్దం ఆఖరు కాకపూర్వమే "మార్క్సిజా"న్ని ఆధారంగా చేసుకొని రాబోయే కాలస్వభావాన్ని గుర్తించి "లెనిను" ఆచరణలో పెట్టడానికి వీలయ్యే స్పష్టముతైన నిర్ణయాలకి వచ్చేడు. సమయం వచ్చినపుడు పరిస్థితులకి సరిపడేటట్లు నడుచుకోగలిగేడు. సమకాలీనులయిన రాజకీయవేత్తల కంటేను, రాజకీయ నాయకులకంటేను "లెనిను"లో గల విశిష్టమైన గొప్పతనం ఇదే.

ఏనాడో జరుగబోయే చారిత్రక సంఘటనలను అంత స్పష్టంగా, సరిగ్గా తెలుసుకోగల శక్తి "లెనిను"నకు ఏలాగ కల్గింది? "మార్క్సిజం" వలననే. అతడు "మార్క్సిజా"న్ని దురహంకారులు, మూర్ఖులు, మోసగాండ్రుఅయిన రాజకీయవేత్తల చేతులనుండి తప్పించి దానికి ఒక కొత్త వెలుగు నిచ్చేడు.

"లెనిన్" చేసిన పనులను గురించి తెలుసుకోవాలంటే ఆ పనులన్నిటికీ పునాదిరాళ్ళవంటి మార్క్సిస్టు మూలసిద్ధాంతాల్నీ అతడు పని చేసిన యుగస్వభావాన్నీ గురించి ముందుగా తెలుసుకోవాలి.

ప్రకృతి, మానవజీవితం, సమాజముయొక్క చరిత్ర, ఈమూడూ ప్రపంచంలో అన్ని మూలలా ఒకేవిధంగా ఒకేనిర్ణీతమైన క్రమవిధానంలో ఒకదానిమీద నొకటి ఆధారపడి నడుస్తున్నాయని శాస్త్రీయంగా నిరూపించడమే మార్క్సిజం యొక్క ముఖ్యలక్షణం.

19 వ శతాబ్దపు రెండోపాదంలో ఈమార్క్సిజం బాగా విజృంభించింది. ఆరోజులనాటికే ప్రస్తుత సమాజంలోగల పరస్పరవైరుధ్యాలన్నీ విస్పష్టం కాసాగేయి.

అంతకుపూర్వమే జరిగిన మధ్యతరగతి ప్రజల విప్లవాలు కారణంగా కొన్ని ముఖ్యదేశాల్లో—అందులోనూ ప్రత్యేకంగా ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలలో రాజ్యాధికారం పెట్టుబడిదారుల చేతులలో పడిపోయింది. పెట్టుబడిదారీ విధానమే ప్రపంచం అంతటా ప్రాముఖ్యం వహించింది. యంత్రపరిశ్రమలు బ్రహ్మాండంగా అభివృద్ధి పొందడం ఆరంభించేయి. నూతనంగా అధికారంలోకి వచ్చిన ఈ పెట్టుబడిదారుల దృష్టిలో "మానవుని హక్కులు"—"స్వాతంత్ర్యం—సమానత్వం—సోదరత్వం" అనే హెచ్చరికలతో ఆరంభం అయి, జాతీయప్రభుత్వ నిర్మాణాలలో పర్యవసానం పొందిన ఉదార ధనికవాద సిద్ధాంతాలు, శాసనబద్ధములయిన ప్రభుత్వాలు, అంతర్జాతీయ వాణిజ్యం, మొదలయినవే మానవ సమాజ పరిణామంలో ఆఖరిమెట్టుగా కనిపించేయి.

కాని ఆనాటి కప్పుడే పెట్టుబడిదారీ విధానంలోగల బాధలు బయటపడడం ఆరంభించేయి. ఈ—"స్వాతంత్ర్యం-సమానత్వం—సోదరత్వం" మొదలయిన హెచ్చరికలు వర్గాధిక్యతను, వర్గపరిపాలనను, కప్పిపుచ్చేటందుకు చెప్పే శుష్కప్రియాలు తప్ప వేరు కాదని కష్టజీవులయిన ప్రజాసామాన్యం ఆనాటికే గ్రహించింది. ప్రజాసామాన్యం అంతా విప

రితమయిన శ్రమకి, దాస్యానికి, దారిద్ర్యానికి, చిక్కి మామూలుగానే నలిగిపోతూన్నారు. వస్తువుల ఉత్పత్తిలోను—పంపకంలోను గొప్ప అరాజకం ఏర్పడింది. మాటిమాటికి ఆర్థిక క్లేశాలు గొంతుమీదికి వస్తున్నాయి. సంపదలకీ—దారిద్ర్యానికీ మధ్యగల అంతరం అగాధం అయిపోతూంది. వర్తకం కోసమూ, లాభాలకోసమూ, ప్రపంచం అంతటా కూడా భయంకరంగా పోటీలు పెరిగిపోతూన్నాయి. ఈవైపరీత్యాలన్నీ పెట్టుబడిదారీ విధానంలో అణిగి దాగియున్న పరస్పర వైరుధ్యాలను బయట పెడుతున్నాయి.

అంతవరకు ఏమాత్రమూ వ్యక్తిత్వం లేకుండా కేవలం పెట్టుబడిదారులకి ఐశ్వర్యం చేసిపెట్టే యంత్రంగా మాత్రమే యున్న శ్రామిక వర్గం సమాజంలో గొప్ప పరిణామాన్ని తీసుకురాగల స్వతంత్రశక్తి సంపాదించి రాబోయే నూతనసమాజంలో ప్రముఖపాత్ర ధరించే శక్తిగా విజృంభించి, అప్పుడప్పుడే సాంఘిక—రాజకీయ రంగాలలో అడుగుపెట్ట సాగింది. ఈవర్గం ప్రారంభస్థితిలో ఒకదారీ—తెన్నూ లేకుండాఉన్నా క్రమక్రమంగా రాజకీయచైతన్యం పొంది, ఒకే ఒక గమ్యంతో వృద్ధి పొంద సాగింది. కార్మికోద్యమము యొక్క ప్రారంభ దశలోనూ, ఇంగ్లండులో బయలుదేరిన చార్టిస్టు ఉద్యమంలోను. మనం పైవిషయాన్ని స్పష్టంగా చూడగలం. ఇంతవరకూ వచ్చేటప్పటికి బూర్జువా వర్గము ఆనాటి సామాజిక వ్యవస్థను ఈనూతనశక్తుల బారినుంచి తప్పించి సంరక్షించుకొనడానికై పూర్వపు విప్లవ తత్వాన్ని పూర్తిగా విడిచిపెట్టి విప్లవముయెడ ప్రతికూల భావాన్ని స్పష్టంగా కనబరుపసాగింది.

ఒకవంక శ్రామికవర్గ విప్లవాలు ఆరంభం అవుతూంటే వేరొక మూల పెట్టుబడిదారీతత్వంమీద విమర్శనలు బయలుదేరసాగేయి. తత్వవేత్తలలో కొందరు మధ్యయుగం నాటి అభిప్రాయాలలో ఊగులాడ సాగేరు. (ఇంగ్లండులో "కార్లయిలు" మొదలగువారు.) కొంత మంది అస్పష్టమైన మానవసేవాసక్తి ప్రకటించసాగేరు. (సిస్మాండీ వగైరాలు)

మరికొందరు నూతన సమాజవ్యవస్థను వాంఛిస్తూ ఆభాస సామ్యవాదా నికి (Utopian Socialism) పునాదులు వేసేరు. (సైంటు సిమ్మన్, ఫరియర్, ఓవెన్ వగైరాలు) ఈ ఆభాస సామ్యవాదులు పెట్టుబడిదారీ విధానంలోగల లోపాలను విమర్శిస్తూ పరస్పర సహకారంతో కూడిన సామాజిక వ్యవస్థ అవసరం అన్నారు. కాని, వారికి సమాజపరిణామాన్ని గురించి విస్పష్టమ్మైన అభిప్రాయాలు లేవు. అందుచేత వారి ఆద ర్శాన్ని సాధించడానికిగల ఒకేఒక సాధనమైన—వర్గకలహ సిద్ధాంతాన్ని మరచిపోయి రాజ్యాధికారం వహించియున్న బూర్జువావర్గానికి ఏవిధం గానూ ఉపకరించని నూతన సమాజవ్యవస్థ చేయమంటూ ఉపదేశం ఆరంభించేరు.

క్రమాభివృద్ధి పొందిన విజ్ఞానము, తత్త్వశాస్త్రము కూడానూతన సమాజం నిర్మించవలసిన అవసరాన్ని సూచించేయి. బూర్జువా విజ్ఞానం తాను పొందగలంత అభివృద్ధి పొందింది. ఇంక అంతకంటె అభివృద్ధికి రాలేకపోవడంచేత 'తనంతతానే క్షీణించిపోసాగింది. 19 వ శతాబ్దపు మొదటిపాదంలో హెగెలురచనలతో బూర్జువావిజ్ఞానంలోని ఉత్కృష్టత పారం ముట్టింది. తనకు పూర్వం జీవించిన తత్త్వశాస్త్రవేత్తలయొక్క ఆదర్శవాదాలను, మూర్ఖపు టాలోచనలను, అనిశ్చితమ్మైన అనుమానా లను, తర్కాలకు నిలబడలేవని ఖండించి హెగెల్ తత్త్వశాస్త్రంలో ఒక గొప్ప విప్లవాన్ని సాధించేడు. ఈ ప్రపంచం, జీవితం, సమాజం అనేవి పరస్పరాశ్రయం కల్వై నిర్ణీతమార్గంలో అభివృద్ధిని పొందుతా యనీ పరస్పరసంఘర్షణల వలన, వైరుధ్యాలవలన, గతితార్కికవిధా నంలో కొత్తకొత్త రూపాలు పొందుతూ వుంటాయనీ; ఆ గతిక్రమానికి గల కీలకం పట్టుకొని దానిని నిర్ణయించడానికి తగు అవకాశా లున్నా యనీ, ప్రత్యక్షరూపంలో సవిమర్శకమైన సింద్ధాంతాన్ని ప్రపంచంఎదుట పెట్టినది ఈ హెగెలే. కాని, అతడు ఆ గతిక్రమంలో వున్న మూల శక్తుల్ని ఊహాప్రపంచంలోనే వదిలివేసేడు. నిజం ఆలోచిస్తే రాజ్యాంగం

అనేది సమాజంలోనే పుట్టిందనీ, సమాజానికి అది కేవలం ప్రతినిధి మాత్రమేననీ తెలుస్తుంది. కాని హెగెలు రాజ్యాంగంకీ, సమాజానికీ, సంబంధం లేదనీ అది సమాజానికి కూడా అతీతమైనదే యని పట్టి గొడవ పెంచేడు. అందుచేత ఆతని తత్త్వశాస్త్రం ఆచరణాత్మము కాలేదు. పూర్ణంగా శాస్త్రీయము, సవిమర్శకము కూడా కాలేకపోయింది. పైగా నిగూఢం, ప్రతిఘాతుకం, అయి కేవలం ప్రష్యనురాజరికాన్ని సమర్ధించేదిగా తయారైంది. ఈలోపాలున్నా అతనిదే బూర్జువాసిద్ధాంతాలలో ఉత్తమము. అదే ఆఖరుది కూడాను. అతని తరువాత బూర్జువాతత్త్వశాస్త్రము (హెగెలియనులలో అతివాదీ, భౌతికవాదీ, అయిన ఫ్యూయర్ బాహ్ మినహాగా) అవిమర్శకమైన వ్యక్తివాదాలికీ, సిద్ధాంతవాదానికీ, తావిచ్చి పరస్పరం సంబంధంలేని వేరువేరుభావాల ప్రోగుగా పట్టికబుర్ల ప్రోగుగా తయారయింది.

అదే మాదిరిగా బూర్జువా ఆర్థికసిద్ధాంతం 19 వ శతాబ్దంయొక్క మొదటిపాదంలో రికార్డో రచనలతో ఔన్నత్యం పొందింది. ఈ ఆర్థిక శాస్త్రవేత్తలు ఈకొత్త—బూర్జువా—సమాజానికి సంబంధించిన ఆర్థిక సూత్రాలను అన్నింటినీ సశాస్త్రీయంగా వివరించడానికి పూనుకొన్నారు. కాని వారి మనస్సులలో బూర్జువాసంఘవ్యవస్థ స్వభావసిద్ధంగా తటస్థపడిందనీ, దానికింక చలనం లేదనీ, ఒక దుర్భ్రమ పాతుకుపోయి వుండడంచేత పర్యవసానంలోనికి వచ్చేటప్పటికి "శిస్తు—వడ్డీ—లాభం" వీనియొక్క వివరణాన్ని శాస్త్రీయంగా నిర్వచించలేకపోయేరు. ఆనాటినుంచీ బూర్జువా అర్థశాస్త్రంలో శాస్త్రాంగాభివృద్ధి లోపించిపోయింది. కేవలం మార్కెటుధరలు నిర్ణయించడం కోసం మాత్రమే అది వినియోగపడసాగింది. ముఖ్యములయిన ఆర్థికక్రమవికాసాల్ని అర్థమూ చేసుకోలేకపోయింది. ఊహించనూ లేకపోయింది. ఆఖరికి నవ్వులాటపాలైంది.

పెట్టుబడిదారీవిధానానికి పారిశ్రామికరంగంలో సహకారం చేయగలగడంవలన ఒక్క ప్రకృతిశాస్త్రాలు మాత్రమే ఆ 19 వ శతాబ్దంలో

ప్రభుత్వాధికారశక్తులు వ్యతిరేకంగా వున్నా వానితో నిరంతర సంఘర్షణలు జరుపుతూనే అభివృద్ధి పొందేవి. కాని, ఇవయినా పరస్పరము ఏమాత్రము సామాన్యసంబంధములేక తమతమ హద్దులలోనే పనిచేసి ఒక ప్రత్యేకదశకి వచ్చేయి. ఈ దశలో అభివృద్ధి స్తంభించి, క్లిష్టస్థితులు ఏర్పడినాయి. అంతకంటె విశేషమైన అభివృద్ధి కావాలంటే నిర్బంధాల్ని సడలించి, పరస్పరసామరస్యంతో కూడిన నూతనపథకం వేయవలసి వచ్చింది. లేకపోతే విజ్ఞానశాస్త్రాలే నశించిపోయే స్థితి ఏర్పడింది.

మానవజీవితం, చరిత్ర, సామాజిక—రాజకీయసంస్థలు, ఇవన్నీ ఒకే ఒక క్రమవిధానంలోకి వివిధఅంగాలనుగా పరిగణించి, మొత్తం మీద వానిలో వానికిగల సంబంధాన్నిగురించి నిర్వచించడానికి మార్క్సునకు పూర్వం ప్రయత్నించబడలేదు.

అందుచేత మార్క్సునకు పూర్వం మానవసమాజం పరస్పర విరుద్ధములయిన శక్తులయొక్క అంధసమ్మేళనాఫలితంగా ఒక్కొక్కప్పుడు భయంకరపరిస్థితులకి లోనవుతూనే గుడ్డిగా అభివృద్ధి పొందింది. ఆ విరుద్ధశక్తుల ప్రాబల్యంవలన కలిగే సమిష్టిఫలితాన్ని తెలుసుకుందుకు కూడా ఎన్నడూ ప్రయత్నం చేయబడనేలేదు.

పూర్వపు సిద్ధాంతాలు ప్రాబల్యంలో ఉన్నంతవరకూ ఈ పరిణామం గుడ్డిగానే సాగుతూ వచ్చింది. (ప్రపంచయుద్ధము; ప్రస్తుతకాలమందలి ఆర్థికదుస్థితి) శాస్త్రీయమైన ప్రపంచదృక్పథంతోటీ కార్యానుసరణంతోటీ, కూడుకొన్న ఒకనూతననిర్మాణ సిద్ధాంతం (అంతర్జాతీయ కార్మికవర్గం ద్వారా గుర్తించబడిన మార్క్సిజం లేక అంతర్జాతీయ సామ్యవాదం) అడుగడుగుకీ అధిక ప్రాముఖ్యతను పొందుతూంది. ఆఖరుకి అది ఈ గతివిధానాన్ని సంపూర్ణంగా స్వాధీనం చేసుకోగలుగుతుంది కూడా.

19 వ శతాబ్దంలో ఈ విధంగా క్లిష్టపరిస్థితులు ఏర్పడియున్న సమయాన అన్నిమూలలా నూతనశక్తులు—సమస్యలు—కలహాలు విపరీ

పగుతూంటే అధికారంలోయున్న బూర్జువావిజ్ఞానానికి ఆ పరి దుర్కొనగలశక్తి క్షీణించి నశించిపోతూన్న సమయంలో; తనకు పూర్వం జీవించిన తత్త్వశాస్త్రజ్ఞుల సిద్ధాంతాలనీ—విజ్ఞా లంకషంగా చదువుకొని ప్రస్తుత ప్రపంచపరిస్థితు లన్నిటినీ గ్రహించి భవిష్యత్సమాజనిర్మాణానికి విస్పష్టమైన మార్గం పించగలిగేడు. అందుచేత అతడు 19వ శతాబ్దపు యుగ ధునికప్రపంచ నిర్మాతగా పేరు పొందేడు.

ట్టమొదట్లో సంపూర్ణంగా శాస్త్రసమ్మతమైన దృష్టితో ప్రపంచ నను సాగించ మార్క్సు ఒక బాట వేసేడు. అదే గతితార్కిక పర్యాలోచనం!

గెలుయొక్క గతితర్కాన్ని ఆధారంగా చేసుకొని మార్క్సు తాలు నిర్మించేడు. కాని హెగెలుయొక్క సిద్ధాంతాలలోగల శూన్యములైన ఆదర్శవాదసిద్ధాంతభాగాన్ని రద్దుచేసేడు. భావ అన్నది శూన్యంలో పుట్టిన నిగూఢసృష్టికాదనీ, అది కేవలం ంచంయొక్క ప్రతిబింబం మాత్రమేననీ భౌతికవాది, హెగె శిష్యుడు అయిన ఫ్యూయర్‌బాహ్‌నుంచి గ్రహించేడు. కాని బాహ్ సిద్ధాంతాలలోగలప్రయత్నశూన్యతనీ ఇంగ్లాండు, ఫ్రాంసు భౌతికవాదములలోగల యాంత్రికతనీ నిరసించేడు. ఆలోచనా మానవునిచర్య అనేవి కేవలం భౌతికప్రపంచంయొక్క నిర్జీవ లుమాత్రమే కావనీ, అవి భౌతికప్రపంచాన్నికూడా మార్చుతూ మార్క్సు తనవాదములో నిరూపించేడు. ఆచరణలోను— లోనూగల ఐక్యభావమే గతితార్కికవాదమునందలి విశిష్టత. స్త్రజ్ఞులు ప్రపంచాన్ని గురించి అనేకవిధాలుగా అర్థంచెప్పేరు. ం చేయవలసినపని దానిని మార్చడమే "(మార్క్సు: Theses ach) ఈ విషయం మార్క్సు లెనినుల జీవితాలలో పూర్తిగా వుతూంది.

ఈదృక్పథంనుంచి పరిశీలించి మానవచరిత్రపరిణామం అనేది హేతురహితంగా, కలగాపులగంగా ఒకదారీ తెన్నూలేకుండా జరిగిన ఘటనాక్రమంగాని, కారణశూన్యములయిన భావాలయొక్క, నిర్ణయాలయొక్క పర్యవసానంగాని కాదని మార్క్సు నిరూపించేడు. అంతే కాదు. భౌతికోత్పత్తిశక్తులు ఒకప్రత్యేకస్థితికి వచ్చేక వానిని ఆధారం చేసుకొని వానికి ఫలితంగా ఏర్పడిన సాంఘిక సంబంధాలనుంచి కొత్త కొత్త సాంఘిక సంచలనానికి, నూతనవర్గసంబంధాలకి, నూతనభావాలకి, నూతనములయిన సాంఘిక—రాజకీయనిర్మాణాలకి, ఆనిర్మాణాలు కారణంగా జన్మించిన సంఘటనలకి, వైరుధ్యాలకి, ఈ మొదలయిన వానికన్నిటికీ ప్రోత్సాహం ఇస్తూ సమాజముయొక్క భవిష్యదభివృద్ధికి దారితీసే క్రమబద్ధమైన పరిణామం మాత్రమేననీ, దానిని శాస్త్రీయంగా నిర్వచించడానికి తగిన అవకాశాలున్నాయనీ మార్క్సు వివరించగలిగేడు.

ఉత్పత్తి చాలా తక్కువగాయుండి లాభాలకి తావు లేకపోవడంచేత ఎట్టిదోపిడీకిగాని, వర్గభేదాలకిగాని, అవకాశం లేని, పురాతనసామాజికవాదయుగం గతించిన తర్వాత ఆనాటినుండి నేటివరకూ గలచరిత్ర మనకు దొరకినంతవరకూ పరిశీలిస్తే—ఉత్పత్తియొక్క వేరువేరు అవస్థలలో వర్గకలహాలద్వారా పరిణామం పొందుతూ ప్రత్యేకవర్గాధికారాలు కలిగి, వివిధరూపాలలో వృద్ధిపొందిన వర్గసమాజముల క్రమపరంపర యని స్పష్టం అయింది.

ధనికవాదం అనేది శాశ్వతమూ కాదు, అనివార్యమైన "స్వాభావికావసరమూ" కాదు. బూర్జువాతత్వశాస్త్రవేత్తలు చెప్పినట్లు చరిత్రకు అందని ఆర్థికన్యాయము అంతకన్నా కాదు అని ఈ పరిశీలనవలన తేలిపోయింది. దానికి కూడా తుది—మొదలు గలవనీ, అది కూడా ఒక చారిత్రక అవస్థ మాత్రమేననీ, పైపెచ్చు వర్గయుతసమాజవ్యవస్థలలో ఇదియే ఆఖరుఘట్టమని స్పష్టంగా తెలిసిపోయింది. భూస్వామిక సమాజంనుంచి పుట్టిన ఈధనికవాదం అంతకుపూర్వం ప్రాధాన్యతవహించి

యున్న వర్గాల సౌకర్యాలనూ, వర్గభేదాలనూ, వెనుకకు నెట్టేసి వాటి స్థానంలో రెండే రెండు వర్గాలను సృష్టించింది. ఇతరుల శ్రమశక్తి మీదనే జీవించే ఆస్తిపరులు — బూర్జువాలు — ఒకవర్గం, మాటవరసకి స్వాతంత్ర్యం కలిగియున్నా ఉత్పాదకశక్తులమీద అధికారం లేకపోవడం చేత జీవితనిర్వహణం కోసం బూర్జువావర్గంమీదనే ఆధారపడియుండి కూలిమీదనే జీవించే శ్రామికవర్గం రెండోది. గతితార్కిక భౌతికవాద విధానాన్ని ఆయాకాలములనాటి సమాజపరిణామస్థితికి సరిపెట్టి ధనిక వాదములోగల పరిణామరహస్యాన్ని కనిపెట్టడమే మార్క్స్ చేసిన మహత్తరకార్యం. ధనికవాదం ప్రజల్ని హింసించినా క్రౌర్యం ప్రదర్శించినా పోటీలద్వారా ఉత్పాదక శక్తుల్ని నిరంతరం అభివృద్ధిలోకి తీసుకొనివచ్చి, ఉత్పత్తిని అధికాధికం చేసి పెట్టుబడిని కేంద్రీకరింపచేసి, శ్రామికవర్గంయొక్క సంఖ్యను పెంచేసి ప్రారంభదశలో మాత్రం అభివృద్ధికరమే అయినదని మార్క్స్ నిరూపించగలిగేడు. కాని ఈ గతిక్రమంలోనే ధనికవాదం స్వవినాశాన్ని తెచ్చుకుంది. ఆస్తిపై వ్యక్తులకి అధికారం వుండాలనే సిద్ధాంతముమీదనే ఆధారపడియున్న ధనికవాదం కేవలం వ్యతిరేకమయిన వ్యవస్థకే దారితీసింది. ఉత్పత్తిలో సహాయపడే ప్రజలకి ఉత్పాదకశక్తులమీద అధికారం లేకుండా చేయబడింది. హద్దూపద్దూ లేకుండా విశేషంగా వస్తూత్పత్తి చేయడానికి అవకాశాలున్నా ఆ ఫలితాన్ని తేరగా కూర్చునితినే కొద్దిమంది ధనికులు తమ స్వాధీనం చేసుకొనగలగడంతోటే ఉత్పత్తివిధానంలో భవిష్యదభివృద్ధి నిరోధించబడిపోయింది. ఈవిధంగా నూతనవ్యవస్థ ఏర్పరచవలసిన అవసరం కలిగింది. ఈస్థితికి వచ్చినాక ధనికవాదం అభివృద్ధిపథాన్ని విడిచిపెట్టి తిరుగుముఖం పట్టింది. యంత్రపరిశ్రమలు క్రమంగా విశేషాభివృద్ధి పొందుతూన్నాయి. క్లిష్టపరిస్థితులు, ఆర్థికమాంద్యములు, తరచుగా తటస్థించుతూన్నాయి. సంపదలు—సంపదుత్పాదకశక్తి చాలా ఎక్కువగా ఉంటూ వుండగానే ప్రజలు విశేషంగా దారిద్ర్యంలో మునిగిపోతున్నారు. రోజు రోజుకీ బూర్జువావర్గానికి — శ్రామికవర్గానికీమధ్య సంఘర్షణలు

తీవ్రంగా పెరిగిపోతూన్నాయి. ఈవిషయాలన్నీ ధనికవాదంలో గల వైరుధ్యాలనీ దాని పతనాన్ని సూచిస్తూన్నాయి. పరిస్థితుల ప్రాబల్యం చేత శ్రామికవర్గం ఏకీభావాన్ని పొంది ఉత్పత్తిసాధనాలమీద సమిష్టి అధికారం స్థాపించి తద్వారా తమబాధలు తొలగించుకోవలసిన అవసరం ఏర్పడింది. శ్రామికవర్గముయొక్క పోరాటం ఒక్కటే అభివృద్ధికర మయిన శక్తిగా మిగిలింది. శ్రామికవర్గం రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకొని పెట్టుబడిదారుల చేతులనుంచి ఉత్పత్తిసాధనాలు తీసుకొని మానవోపయోగమే పరమావధిగా ఉండేటట్లు ఉత్పత్తిని సమాజపరం చేసి వర్గరహితసమాజాన్ని నిర్మించగలిగేటందుకై దానిని విప్లవరంగా నికి కొనిపోవడమే తరవాయి. ఇందులోనే ఆధునికయుగ సమస్యలన్ని టినీ పరిష్కరించగల సాధనం మార్క్సునకు కనపడింది.

ఉత్పత్తిని సామాజికపద్ధతులమీద నడిపించాలన్నా, భవిష్యత్తులో వర్గరహితసమాజాన్ని నిర్మించేటందుకు దారితీయాలన్నా ముఖ్యంగా శ్రామికవర్గనియంతృత్వం స్థాపించకతీరదని మార్క్సు గుర్తించేడు.

ప్రపంచం అంతటా ఈనిర్మాణపద్ధతి వ్యాపింపచేయాలి అంటే కార్మికవర్గానికి అంతర్జాతీయంగా విప్లవకరపక్షనిర్మాణం అవసరం.

ఈసిద్ధాంతాలను వివరించడంలోను కార్యరంగంలో నాయకత్వం వహించడంలో కూడా సమానభాగస్వాములు కాగల గౌరవాల్ని పొందిన ఏంగిల్సు—మార్క్సులు సిద్ధాంతరంగంలోను—విప్లవరంగంలోను కూడా తమ జీవితాలను ధారపోసేరు.

19 వ శతాబ్దపు ఉత్తరార్ధభాగంలో అంతర్జాతీయ కార్మికోద్య మాల్ని అభివృద్ధిలోకి తేవడం విషయంలోను, దానికి ఒకస్వరూపం ఈయడంలోను వారు ఇద్దరూ చాలా పాటుపడి పనిచేసేరు. ఇంటర్నేష నల్ కమ్యూనిస్టులీగు, ప్రథమఅంతర్జాతీయ కార్మికసమాఖ్య (First International) ద్వారా ప్రపంచంలోని వివిధదేశాల కార్మికోద్యమాలతో సంబంధం పెట్టుకొనేటట్లుచేసి అంతర్జాతీయకార్మికోద్యమానికి శిగుశిక్ష

ఐము నిచ్చి దానినొక మార్గానికి తెచ్చేరు. 1883 లో మార్క్సు చని పోయిననాటికే మార్క్సిజం అంతర్జాతీయ కార్మికోద్యమానికి పునాదిగా చేయబడింది. 1895 లో ఏంగిల్సు చనిపోయిననాటికి ఆ విషయం బాగా దృఢపరచబడిపోయింది.

మార్క్సు—ఏంగిల్సులు మరణించేకకాని ధనికవాదానికీ, కార్మిక వర్గవిప్లవానికీ తీవ్రసంఘట్టనలు కలుగవలసిన పరిస్థితులు ఏర్పడలేదు. 1848 నాటి విప్లవయుద్ధాలూ, 1871 లో ఆరువారాలపాటు కార్మికులచేత పరిపాలింపబడిన పారిసుకమ్యూను, రాబోయే సంఘట్టనల స్వరూపాన్ని సూచించేయి. అయినప్పటికీ పెట్టుబడిదారీవాదం ప్రపంచవిప్లవం వచ్చి పతనం పొందేసమయం వచ్చేలోపున ఇంకా మూలమూలకి వ్యాపించి విజృంభించడానికి అవకాశాలు ఉంటూనేవచ్చేయి.

ధనికవాదం ప్రపంచం అంతటా వ్యాపించడంలో, వేళ్ళమీద లెక్కపెట్టతగిన కొద్దిపాటి యూరపుఖండరాజ్యాలకీ, సంయుక్తరాష్ట్రాలకీ మాత్రమే ఈప్రపంచంలో అధికభాగం దఖలుపడిపోయే స్థితి ఏర్పడింది. 19 వ శతాబ్దం ఆఖరునాటికి మొత్తంమీద ప్రపంచవిభజనం పూర్తి అయింది. పాశ్చాత్యప్రభుత్వాల మోనాపలీకాపిటలిజం * ప్రపంచాన్ని తన గుప్పిట పెట్టుకుంది. అధికారంలోయున్న ధనికవర్గాల చేతుల లోనికి హద్దులేనన్ని లాభాలు ప్రవహించేయి. ఈ లాభాలలో కొంత భాగం కార్మికులకి ఏదో కొద్దిపాటి సంస్కరణాల నిచ్చీ, నాయకులకు లంచాలనిచ్చి విజృంభిస్తూన్న కార్మికోద్యమాలను నిలువరించడంలో వినియోగించబడ్డాయి. పెట్టుబడిదారీవాదం పతనావస్థను—ఇతరుల శ్రమ మీదనేగాని నిలువబడలేని స్థితిని—సమీపించింది. తీవ్రములయిన ఆర్థిక

* ఇది ధనికవాదంలో ఒకప్రత్యేక దశ. ఈదశలో వేరు వేరుగా ఉండే పెట్టుబడిదారీసంస్థలు తమలో తమకుగల పోటీని అణచి, ధరలు తగ్గకుండా వుండటానికి ఒకేఒక కేంద్రసంస్థగా ఏర్పడుతాయి. ఉదాహరణకి స్టాండర్డు ఆయిల్ కంపెని ఈవిధంగా ఏర్పడినదే.

క్లేశాలను సృష్టిస్తూ— "లెనిన్" చెప్పినట్లు చరమావస్థయైన సామ్రాజ్య వాదయుగాన్ని ప్రవేశించింది.

సామ్రాజ్యవాదయుగమే "లెనిన్" యుగం.

మార్క్సు—ఎంగిల్సుల రచనలు సామ్రాజ్యవాదయుగస్వభావాన్ని స్పష్టంగా వివరించగలిగేయి. వారు ఆ యుగప్రారంభదశను మాత్రమే చూడగలిగేరు. కాని దాని పరిణామాన్ని చూడడానికి తగినంతకాలం జీవించలేకపోయేరు.

అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమముయొక్క నాయకత్వం, మార్క్సు—ఏంగిల్సులనుండి లెనినుకు సంక్రమించింది. 1917 లో విజయంలభించి, గమ్యం సాధించబడేవరకు ఈ విషయం ప్రపంచంచేత గుర్తించబడనూ లేదు; గుర్తించినా లక్ష్యమూ చేయబడలేదు. అయితేనేం? నిజానికి మార్క్సు—ఏంగిల్సులు మరణించేక ఆ నాయకత్వం "లెనిన్" చేతులలోనే వుండిపోయింది.

మార్క్సు—ఏంగిల్సులు మరణించిన కొత్తలో—సామ్రాజ్యవాద యుగం ఆరంభం అయినరోజులలో అంతర్జాతీయి కార్మికోద్యమము గంద్రగోళములో పడిపోయి, తనవిప్లవగమ్యాన్ని విడిచిపెట్టింది. 1889 నుంచీకూడా రెండవ అంతర్జాతీయ కార్మికసమాఖ్య (Communist International) యాజమాన్యంక్రిందను, అంతర్జాతీయ కేంద్ర కార్మిక సంఘంయొక్క యాజమాన్యం క్రిందను, (International Fedaration of Trade unions) స్థాపించబడిన సోషలిస్టుపార్టీలు. ట్రేడ్‌యూనియన్లు, సంఖ్యలోను, బలంలోను కూడా విపరీతంగా దృఢపడ్డాయి. 1914నాటికి సోషలిస్టుఇంటర్నేషనలులో 120 లక్షలమంది సభ్యులున్నారు. అయితేనేం? మార్క్సిస్టుప్రణాళిక నామమాత్రావశేషంగానే వుండిపోయింది. ఆచరణలోకి వచ్చేటప్పటికి ఒడుగుబాటుదనం (Opportunism) ఎక్కువ అయిపోయింది. ఏదో కొద్ది సంస్కరణాలకోసం అధికారంలోయున్న ధనికవాదాన్ని అనుసరించడం ఎక్కువ అయిపోయింది.

సామ్రాజ్యవాద యుగముయొక్క నిజస్వభావము ప్రారంభంలో సోషలిస్టులలో చాలామందికి అర్థంకానేలేదు. అప్పటికే ఇంటర్నేషనలు సోషలిస్టు సంఘంలో ఒదుగుబాటుతనం ఎక్కువగా వ్యాపించింది. సామ్రాజ్యవాదయుగం మార్క్సిజాన్ని ఖండిస్తూన్నట్లు వీరు తలచేరు. పెట్టుబడిదారీవాదం వైరుధ్యాలనన్నింటినీ గడచి నూతనజీవితానికీ, ఉత్తమ సమాజ నిర్మాణానికీ, దారితీస్తూందని భ్రమపడ్డారు. ఈ వైరుధ్యాలన్నీ క్రమంగా సర్దుబాటుఅయిపోతాయనీ, సంఘంసంస్కరింపబడి ప్రజలందరి స్థితీ బాగుపడుతుందనీ విప్లవంతో పనిలేకుడా శాంతపద్ధతులమీద సోషలిజం తీసుకొనిరావడానికి అవకాశాలు ఉన్నాయనీ వీరు ఊహించేరు. ఈ అభిప్రాయాలన్నీ సోషలిస్టు ఇంటర్నేషనలుచేత మాటవరసకి తిరస్కరింపబడినా, ఆచరణలో పెట్టేటప్పుడు వానికే అధికాధికంగా ప్రాముఖ్యత ఈయబడింది.

ప్రపంచయుద్ధం ఈదురభిప్రాయా లన్నింటినీ ఒక్కమారుగా ధ్వంసం చేసేసింది. సామ్రాజ్యవాద యుగంలో తీవ్రములయిన కష్టపరిస్థితులు, ప్రజానాశనము కలుగుతుందనీ, ప్రజాదారిద్ర్యం విపరీతంగా పెరిగిపోతుందనీ, శ్రామికవర్గం విప్లవానికి దారి తీస్తుందనీ స్పష్టం చేసేసింది.

"లెనిన్" రాజకీయజీవితంలో అధికభాగం యుద్ధానికి పూర్వమే సోషలిస్టు ఇంటర్నేషనలులో ఒదుగుబాటుదనం బాగా వ్యాపించి విప్లవ కార్యక్రమం విడిచిపెట్టబడుతూండగా—సామ్రాజ్యవాదయుగసమయంలో గడిచిపోయింది. మార్క్సిజంకోసం ఒదుగుబాటుతనంతో జరిపిన పోరాటంలో బలపడి "లెనిన్" రాబోయే విషమపరిస్థితులను ఎదుర్కొనగలిగేటట్లు తనపార్టీని గట్టిపరచుకున్నాడు.

ఆర్థికక్లేశాలు, రెండవఇంటర్నేషనలుయొక్క పతనం, ప్రపంచయుద్ధంతో పూర్తి అయినాయి. ఎంతోకాలం క్రితమే మార్క్సు సూచించిన మహత్తరమైన ఆర్థికమాంద్యం ప్రపంచాన్ని ఆవరించింది. సమా

జంలోని విరుద్ధశక్తులన్నీ బయటపడి అంతర్జాతీయసోషలిజానికి అగ్ని పరీక్ష తెచ్చి పెట్టేయి.

పరీక్షాసమయం వచ్చేటప్పటికి ఒదుగుబాటుతనంతో కుళ్లిపోయిన సోషలిస్టు ఇంటర్నేషనలు విచ్చిపోయి ఊరుకుంది. ఆ విచ్చిపోవడం తోనే దానిలోచేరిన ప్రముఖపక్షాలన్నీ యుద్ధరంగాలలో ప్రవేశించిన సామ్రాజ్యవాదుల సహాయానికి బహిరంగంగానే పరుగెత్తి పోయేయి.

ఆధునికచరిత్రలో ఇవి చాలా గడ్డురోజులు. మానవసమాజం తనను నాశనం చేయతలపెట్టిన సామ్రాజ్యవాదం చేతులనుంచి తప్పించు కుందుకు అంతర్జాతీయసోషలిజం అండచేరింది. ఎంతో కాలంనుంచి ఎదురుచూస్తూన్న, తయ్యారీ చేసుకుంటూన్న సమయం వచ్చేసింది. క్లిష్ట పరిస్థితుల్ని ఎదుర్కొనడానికై ఎన్నోతరాలు శ్రమపడి, ఎంతో త్యాగం చేసి సంపాదించిన సాధనం దగ్గరనేవున్నా, అది నిరుపయోగం అయి పోయినట్లే స్థిరపడింది. పీకెలమీదికి వచ్చి కూర్చున్న సమయంలో విధ్వంసకశక్తుల చేతులనుంచి తప్పించుకొని బయటపడడానికై అంత పరిశ్రమనూ మళ్లీ మొదటినుంచీ ఆరంభించవలసివచ్చినట్లే కనపడింది.

ఏమైతేనేం, సోషలిస్టు ఇంటర్నేషనలు విచ్ఛిన్నంఅయిందే కాని, ఇంటర్నేషనలు సోషలిజం విచ్ఛిన్నం కాలేదు. క్లిష్టసమయాలలో సామర్థ్యం ప్రదర్శింపగలిగి ప్రపంచవిప్లవాన్ని విజయవంతం అయ్యేటట్టు ప్రారంభించి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవడానికి సామర్థ్యంగల శక్తులు అక్కడవున్నాయి. ఇంకా ఆశక్తులన్నిటికి "లెనిన్"వెనుకఅండ.

మార్క్సు 1883 లో చనిపోయేడు.

ఏంగిల్సు 1895 లో మరణించేడు.

1893 నుంచీ "లెనిన్" రాజకీయోద్యమంలో ప్రవేశించి 1923 లో ఆఖరుపర్యాయం రోగం వచ్చేవరకు, దానిని విశ్రాంతేనా కోర కుండా సాగించేడు.

## రెండవ ప్రకరణము.

# 'లెనిన్' జీవితం.



"లెనిన్" అనే పేరు చూస్తేనే అతని జీవితస్వభావం, కార్యక్రమ పద్ధతీ తెలిసిపోతుంది. అతని అసలుపేరు "వ్లాడిమీర్ ఇలిచ్ ఉలియానోవ్". రష్యాలోని (నేడు U. S. S. R.) సింబర్స్కు గ్రామంలో (నేడు "ఉలియానోస్కు") 1870 వ సంవత్సరం ఏప్రియలు 22 వ తేదీన అతడు పుట్టేడు. ప్రపంచం అందరికీ తెలిసిన "లెనిన్" అనేపేరు అతడు పెరిగి పెద్దవాడు అయినాక జారుప్రభుత్వకాలంలో రహస్యముగా విప్లవకార్యక్రమం సాగించడంకోసం పెట్టుకొన్నదే.

1870–80 ల మధ్య జర్మనీదేశంలో బిస్మార్కు సోషలిస్టులను అణచివేయడానికి కొన్నిశాసనాలు తయారుచేసేడు. ఈచిన్న ఉదాహరణం మినహాగా ఆరోజులలో యూరపుఖండంలో మరి ఎక్కడాకూడా రహస్యంగా విప్లవోద్యమం నడిపించబడినదని చెప్పడానికి తగిన అవకాశాలు ఉన్నట్లు తోచదు. దీనికి కారణం రష్యా వెనుకపడియుండడమే నని చెప్పుతారు. కాని నేడు పరిస్థితులు తారుమారయిపోయినాయి. సోషలిస్టు ప్రచారం ప్రారంభించడంకొరకే కాకుండా, బానిసత్వంనుంచి తప్పించుకొనేటందుకు చేసే రాజకీయపోరాటంలోకూడా విప్లవోద్యమాన్ని రహస్యంగా నడిపితీరవలసి వచ్చింది యూరప్‌లో. రష్యాప్రభుత్వం వెనుకబడి యుండడంవలన యూరపుఖండానికి ఉపకారమే జరిగింది. ముందు ముందు సామ్రాజ్యవాదయుగసమయంలో ఈదేశానికి కలిగిన అనుభవం వానికి మంచిమార్గం చూపగలిగింది. ఆ క్లిష్టపరిస్థితులలో బయలుదేరి వ్యతిరేక వాతావరణంలో అభివృద్ధి చెందిన విప్లవోద్యమమే బలీయమై వేళ్ళుపారింది. అన్నివిధాలా అభివృద్ధి చెందిన యూరపులోని ఇతరదేశాలలో బయలుదేరిన ఉద్యమాలు త్వరలోనే మంచిబలం—ప్రాముఖ్యత పొందేయి. అయితేనేం, అవన్నీ విద్రోహశక్తుల దాడికి పడుతూ-లేస్తూ విపరీతమైన బాధతో నేటివరకు ఇంకా

పోరాటం సాగింపవలసిన విధానాన్ని నేర్చుకుంటూనేవున్నాయి. "లెనిన్" నాయకత్వంక్రింద నడిచిన రష్యనుకార్మికవిప్లవోద్యమానికి అంతర్జాతీయ రంగంలోగల స్థానం తెలుసుకోవాలంటే చరిత్రలో కలిగిన మార్పుల నన్నిటిని తెలుసుకొనడం చాలా అవసరం.

లెనిన్ కార్యక్రమానికి గలమూలసూత్రాలు: పునాదులు.

1917 దాకా "లెనిన్" ప్రపంచరాజకీయాలలో కనపడడని, కన పడినా ఏకొద్దిమంది శిష్యులకోతప్ప ఇతరులకి తెలియబడదనీ, ఒక్కొక్కప్పుడు చెప్పుతూంటారు.

ఇది వట్టి పొరపాటు. లెనిన్ విప్లవజీవితానికంతకీ "సోషలిస్టు ఇంటర్నేషనలు" కేంద్రం వంటిది. దానిద్వారానే అతని కార్యక్రమవిధానం, నాయకత్వం, నిర్వహించబడింది. ఈవిషయంఒక్కటే కాకుండా అతనికి గల చారిత్రకప్రాధాన్యతకూడా ప్రపంచయుద్ధానికి పూర్వమే విదేశీయులయిన బూర్జువా పరిశోధకుల దృష్టిలో పడింది. Cambridge Modern History అనే పేరుతో 1910 లో ప్రకటించబడిన ఒకఉత్తమ గ్రంథంలో రష్యాయొక్క గత ఏబదియేళ్ళచరిత్రను వివరిస్తూ ఒక ప్రకరణం ఉంది. అందులో ఒక అరపుటకు పైగా "లెనిన్" విషయాన్ని గురించి వ్రాస్తూ గ్రంథకర్త 19 వ శతాబ్దంయొక్క ఆఖరుపది లోను, 20 వ శతాబ్దంయొక్క మొదటిపదిలోను, రష్యను చరిత్రమీద "లెనిన్" సిద్ధాంతాలు చాలా పలుకుబడి కలిగియున్నాయని తేల్చేడు. (Cambridge Modern History 1910 నాటిముద్రణం సం. 12, 1. పుటలు 331—338.)

1910 లో బోల్షివికువిప్లవం పొందిన విజయం ఆకాశంలోంచి అద్భుతంగా ఉట్టిపడియుండలేదు. ఎంతోకాలంనుంచి రష్యాలో వ్రేళ్ళు పాతుకొని క్రమక్రమంగా అభివృద్ధిచెందిన విప్లవోద్యమానికి అది ఫల స్వరూపం. ముప్పైఏళ్ళపాటు నిరంతరాయంగా లెనిన్‌చేసిన పరిశ్రమ ఆ ఫలప్రాప్తి విషయంలో చాలా ప్రాముఖ్యం వహించింది.

విప్లవానంతరం ఒకప్పుడు "లెనిన్"—రష్యాలో సంభవించిన బోల్షివికువిప్లవం (సోషలిస్టు విప్లవం) సంపూర్ణంగా గతవిప్లవోద్యమ పరిణామంలోనే పుట్టిందని వ్రాసేడు.

"1840 మొదలు—90 వరకు ఇంచుమించు ఒక అర్ధశతాబ్దంపాటు అతిక్రూరము—విప్లవ వ్యతిరేకము అయిన జారుప్రభుత్వముయొక్క ఒత్తిడిచేత రష్యాలోని బుద్ధిమంతులయిన యువకులు ఎందరో వలసపోయేరు, పోయి ఊరుకోలేదు. ఎంతోజాగ్రత్తగా పరిశోధించి యూరపు-అమెరికాలు సాధించిన "అంతిమపరిణామాన్ని" పరిశీలించి, నేర్పులో అనుసరించి సరియైన విప్లవసూత్రాన్ని వెతికి పట్టుకొన్నారు.

"పేభై సంవత్సరాలుగా ప్రదర్శించిన పరిశ్రమయొక్క — త్యాగముయొక్క బలంతోటి, మహత్తరమైన విప్లవకరపరాక్రమంతో, అద్భుతమైన శక్తితో, నిస్స్వార్థమైన క్రియాకలాపంతో, శిక్షణతో, జ్ఞానంతో, ప్రత్యక్షపరీక్షలతో, ఓటములతో, స్తంభనలతో, ఇతరయూరపు నివాసుల అనుభవాల సమ్మేళనతో, మార్క్సిజం ఒక్కటే విప్లవసిద్ధాంతం అనే నిశ్చయానికి వచ్చి రష్యా దానినే అనుసరించింది. జారు ప్రవేశపెట్టిన నిర్బంధప్రవాసశిక్షకు అభివందనాలు. ఆ ప్రవాసశిక్ష ధర్మమాయని పందొమ్మిదవ శతాబ్దపు ఉత్తరభాగంలో ఏదేశంలోని ఉద్యమాలకూలేని అంతర్జాతీయసంబంధాలను, అత్యుత్తమములయిన విప్లవోద్యమసూత్రాలను, విధానాలను, రష్యావిప్లవోద్యమం సంపాదించుకొనగలిగింది.

—లెనిన్; Left Communism.

ఇతరదేశాలన్నింటిలోకంటె ముందుగా రష్యాలో మార్క్సిస్టు సిద్ధాంతము జయం పొందడానికి, బలవంతమై, అభేద్యం కావడానికి గల అవకాశాలు ఏవో తెలుసుకోవాలంటే రష్యావిప్లవోద్యమముయొక్క అసాధారణస్వభావాన్నీ, విప్లవకార్యక్రమంలో అది పొందిన చిరకాల శిక్షణనూ, విప్లవోద్యమంలో చూపిన త్యాగ—సాహసాలనూ, నిర్దుష్టమైన సిద్ధాంతస్వభావాన్నీ, దానికిగల అద్వితీయమైన అంతర్జాతీయ రాజకీయానుభవాన్నీ స్పష్టంగా తెలుసుకోవాలి.

రష్యాలో పారిశ్రామిక కార్మికవర్గం ఏర్పడడం ఆలస్యమే అయింది. అయితేనేం? వారిలోని విప్లవచైతన్యం అభివృద్ధిపొందడానికి

ఏదేశంలోనూ లేనన్ని అవకాశాలు ఆ దేశంలో ఉన్నాయి. మార్క్సు వ్రాసిన "క్యాపిటలు"కు రష్యనుఅనువాదం 1872 లోనే అంటే మూలం ప్రకటించబడిన అయిదు ఏండ్లకే వెలువడింది. ఆ పుస్తకంయొక్క మొదటిముద్రణం తాలూకు మూడువేలప్రతులు త్వరలోనే చెల్లిపోయినాయి. ఆనాటికి ఆపుస్తకం ఇతరయూరపియను భాషలు వేనిలోనికీ అనువదించబడనేలేదు. 1883 లో ఫ్రెంచిఅనువాదం వచ్చింది. రష్యను అనువాదం ప్రకటించబడిన 14 ఏండ్లకు మొట్టమొదటిమారుగా దానికి ఆంగ్లానువాదం ప్రకటించబడింది.

1887 లో స్థాపించబడిన "శ్రామిక స్వాతంత్ర్య సంఘమే" రష్యాలో స్థాపించబడిన మొట్టమొదటి మార్క్సిస్టుసంఘం. దీనిని "ప్లెఖనోవు" విదేశాలలో ప్రవాసం ఉన్న సమయంలో స్థాపించేడు. ఆసంఘం యొక్క ద్వితీయప్రణాళిక 1887 లో తయారుచేయబడింది. ఈప్రణాళికలోనే రష్యనుసోషల్‌డెమాక్రటిక్‌పార్టీ కార్యక్రమానికి పునాదులు వేయబడినాయి.

1887 లో లెనిను తన 17 వ యేట కాజాన్ విశ్వవిద్యాలయంలో చేరేడు. కాని ఆచేరిన కొద్దిరోజులకే ఒకవిప్లవోద్యమప్రదర్శనంలో పాల్గొన్నందులకై అతడావిశ్వవిద్యాలయంనుంచి తరిమివేయ బడ్డాడు. ఆఏడాదే ఇది జరగడానికి కొంచెం ముందుగా లెనిన్‌యొక్క అన్నగారైన అలగ్జాండరు జారును హత్యచేయడానికై ప్రయత్నించినందులకు ఉరి తీయబడ్డాడు. చిన్నతనంలో లెనినుకు విప్లవోద్యమమునందుగల ప్రత్యక్షానుభవం ఇంతవరకే.

"లెనిన్" తండ్రి స్కూళ్ళ ఇనస్పెక్టరు. ఆయనకి ఇద్దరు కొడుకులు, నలుగురు కూతుళ్లు కలిగేరు. అంతా బాగా చదువుకున్నవాళ్లే. అందరూ విప్లవోద్యమంలో పనిచేసినవారే. జారుప్రభుత్వాన్ని వ్యక్తి దౌర్జన్యపద్ధతులద్వారా (Terrorist) కూలద్రోయడానికి బయలుదేరిన Narodnaya Volya "ప్రజాభిప్రాయం" అనే విప్లవసంఘంలో ప్రాధాన్యత

వహించినవారిలో "లెనిన్" అన్నగారగు అలగ్జాండరు ఆఖరువాడు. గొప్పత్యాగాన్ని, సాహసాన్ని ప్రదర్శించిన "నరోడ్నికీ(ప్రజాభిప్రాయం) పురాతనవిప్లవకారుల్నీ, తన సోదరుడినీ, "లెనిన్" చాలా గౌరవించే వాడు. కాని వారు అవలంబించిన పద్ధతులద్వారా జారుప్రభుత్వాన్ని కూలద్రోయడం అసంభవం అని అతడు గ్రహించేడు. ఏఉపాయా లవ లంబిస్తే జారుప్రభుత్వాన్ని కూలద్రోసి స్వాతంత్ర్యం సంపాదించగలుగు తామా యని అతడు చాలా జాగ్రత్తగా ఆలోచించేడు. మార్కిస్టు పద్ధ తులమీద పోరాటం సాగించడం ఒక్కటే స్వాతంత్ర్యాన్ని సంపాదించి ఈయగలదని అతడు గ్రహించేడు. సామాజికపరిణామ సూత్రాలను శాస్త్రీయంగా నిర్వచించేవిధానాన్ని అతడు మార్క్సునుంచే నేర్చుకు న్నాడు. ప్రస్తుతరాజ్యాంగాధికారాన్ని కూలత్రోయాలంటే ప్రత్యేకవ్యక్తుల ప్రయత్నాలు చాలవనీ, జనసామాన్యముయొక్క సమ్మిళితప్రయత్నం అవసరం అనీ అతడు గ్రహించేడు. శ్రామికవర్గం నాయకత్వం వహించి నడిపించినట్లయితే విప్లవం విజయవంతం కాగలదని తెలుసుకున్నాడు. ఆ రోజులలో మార్కిస్టువాఙ్మయం దొరకడమే గగనంగా వుండేది. అంత క్లిష్టసమయంలోకూడా "లెనిన్" ఆ వాఙ్మయాన్ని సంపాదించి, దొరికినంతవరకు మార్క్సురచనలు కూలంకషంగా చదివేడు. ఒక వైపున ఈపుస్తకాలు చదువుతూనే తనకళాశాలచదువును కూడా పూర్తి చేసి 1891 లో పీటర్సుబర్గులో, న్యాయశాస్త్రంలో పట్టా పుచ్చుకున్నాడు. తరువాత ఒక్క సంవత్సరంపాటు "సమారా"లో ఒకవకీలు దగ్గర జూనియరుగా పనిచేసేడు. కాజాన్‌లో ఉన్నప్పుడు, సమారాలో ఉన్న ప్పుడు కూడ అతడు మార్కిస్టుసంఘాలలో ఎక్కువగా పాల్గొన్నాడు. రష్యాలో మార్కిస్టుపార్టీ ఏదీ ఏర్పడకపూర్వం ఈమార్కిస్టుసంఘమే ఎక్కువ పనిచేసేది. రష్యన్ సోషల్‌డెమాక్రటిక్ పార్టీయొక్క పూర్వ రూపం ఈమార్కిస్టుసంఘమే. "లెనిన్" రైతుసమస్యల్ని గురించి 1893 లో తన మొదటిపుస్తకం వ్రాసేడు. ఆసంవత్సరమే ఆకులురాలు

కాలంలో అతడు పీటర్సుబర్గుకి చేరేడు. అది మొదలుకొనే అతని రాజకీయజీవితం ఆరంభం అయింది.

ఆనాడు వెంటనే అతివేగంగా జరపవలసినపనులు రెండు. సోషల్‌డెమాక్రసీయొక్క రాజకీయకార్యక్రమాన్ని స్పష్టంగా తయారు చేయడం ఒకటి. కార్మికుల నందరినీ సమావేశపరచి, సంఘాలుగా ఏర్పాటుచేసి, సోషల్‌డెమాక్రటిక్‌పార్టీని స్థాపించడం రెండోది. ఈ పనులు 1894—98 నడుమ పూర్తి అయినాయి.

ఆరోజులలో సోషలిజానికి ఎంతో సన్నిహితంగా వుండే విప్లవవాదులభావాలకీ—కార్యక్రమానికీ, సంస్కరణవాదుల భావాలకీ,కారక్రమానికీ భేదం చాలా తక్కువగావుండేది. కనుక వానిని వేరువేరుగా గుర్తించడం కూడా కష్టమైపోయి, ఎంతో గజిబిజిగా వుండేవి. మార్క్సిస్టు సంఘాలు ఏర్పడకపూర్వం మంచి బలం సంపాదిందిన విప్లవోద్యమం తాలూకు నరోడ్నికిలు ఇంకా కొద్దిమంది మిగిలేరు. (వీరి ఆదర్శాలు తర్వాత తర్వాత సోషలిస్టు విప్లవసంఘాల వైపునకు మొగ్గేయి.) వీరు రైతులదే ఆదర్శ సంఘంగా తలపోసి, రష్యాలో యంత్రోత్పత్తీ, పెట్టుబడిదారీవిధానమూ, అభివృద్ధి పొందవలసిన పనిలేదని చెప్పసాగేరు. గ్రామసంఘాలలోనే సోషలిస్టు మూలసూత్రాలు ఇమిడియున్నాయని వీరి అభిప్రాయం.

మార్క్సిస్టులు వీరికి ప్రతికక్షులుగా ఏర్పడ్డారు. కాని మార్క్సిస్టులలో కూడా పెక్కుమంది కేవలం సిద్ధాంతవాదులు—విప్లవరహితమైన శాసనానుకూల కార్యక్రమవాదులు (Legal Marxists) మాత్రమే. పెట్టుబడిదారీవిధానానికి వ్యతిరేకించే పురాతనాదర్శవాదులతో పోరాడడానికై వీరు మార్క్సిజంలోని ఆర్థికసూత్రాలను మాత్రం తీసుకున్నారు. కాని కార్యరంగంలో అడుగుపెట్టేటప్పటికి వెనుక అడుగువేసి కార్మికుల్ని విప్లవసంఘాలలో సమకూర్చడానికిబదులు పెట్టుబడిదారీ విధానానికి దాసులనుగా తయారుచేసి, కేవలం పెట్టుబడిదారీతత్త్వానికి ప్రచారకులుగా

తయారయ్యేరు. ఈవిషయం వారినాయకులు (Struve; Tugan-Baranovsky) ఉదారవాదసిద్ధాంతాలవైపునకు మొగ్గడంవలన రుజువు అయింది. ఇంక మిగిలినది మార్క్సిస్టులు. వీరి నాయకుడు ప్లెఖనోవు విదేశాలలో ప్రవాసం ఉన్నాడు. కనుక "లెనిన్" తాను పీటర్సుబర్గుకి చేరగానే అతి సామర్థ్యంతో వారికి నాయకత్వాన్ని నిర్వహించేడు.

"లెనిన్" కార్యరంగంలో దిగినవెంటనే సోషల్‌డెమాక్రసీలోని విప్లవకార్యక్రమాన్ని స్పష్టంగా వివరించి తదితరపక్షాల ప్రణాళికలనుండి వేరుచేసేడు. ఈపని 1894 లోనే పూర్తి అయింది.

ఆ సంవత్సరమే అతడు "ప్రజలకి మిత్రు లెవరు? వారు సోషల్ డెమాక్రట్లతో ఏవిధంగా పోరాడుతారు?" అనే పేరుతో తన మొదటి పుస్తకాన్ని రహస్యంగా ప్రచురించేడు. దీనితో అతనికి నరోడ్నికీలతో గల సంబంధం అంతరించింది. రష్యాలో సోషల్ డెమాక్రటిక్‌పార్టీకి ఒక రాజకీయకార్యక్రమం ఏర్పాటయింది. యదార్థసంఘటనలను ఆధారం చేసుకొని అతడు దానిలో ఆర్థికపరిణామగతిని ఎంతో చక్కగా వివరించేడు. నిరంకుశత్వాన్ని కూలద్రోసి సోషలిజాన్ని స్థాపించగల విప్లవోద్యమాన్ని ఒక్క కార్మికవర్గమే నడిపించగలదని అతడు నిరూపించేడు. సోషల్‌డెమాక్రటిక్‌పార్టీ నిర్మాణానికై అనుసరించవలసిన కార్యక్రమాన్ని సూచించేడు.

ఈ పుస్తకంతోపాటు "నరోడ్నికీ సిద్ధాంతంలోని ఆర్థికభాగం: స్ట్రూవ్‌మహాశయుడు దానిమీద చేసిన విమర్శనం" అనే పేరుతో ఇంకో పుస్తకాన్ని వ్రాసి ప్రచురించేడు. ఈ గ్రంథంలో లెనిన్ శాసనానుకూల వాదాన్ని ఖండిస్తూ అది బూర్జువాశిబిరానికే దారితీస్తుందని నిరూపించేడు.

ఒకవైపున ప్రతికక్షుల సిద్ధాంతాలకీ, సోషల్‌డెమాక్రసీలోని విప్లవసిద్ధాంతాలకీ, గల భేదాన్ని స్పష్టపరుస్తూనే వుండేవాడు; అదే సమయంలో మరొకవైపున తాము అనుసరించి పోవలసిన కార్యవిధానాన్ని నిరూపిస్తూనే వుండేవాడు. ఈవిధంగా రెండురంగాలలో ఒకే

మారు పోరాడే ఈపద్ధతే ఆదినుంచీ లెనిన్ నాయకత్వంలో గల గొప్పదనం.

మార్క్సిస్టులలోని ఇతరవిప్లవవాదులు, లెనినూకలిసి పీటర్స్బర్గు లోని ఫ్యాక్టరీకూలీలని సంఘాలలోకి చేర్చసాగేరు. కార్మికులకి రాజకీయ పరిజ్ఞానం కలగచేయడం; మార్క్స్ సిద్ధాంతాలను బోధపరచడం: ఆ కార్మికుల మనస్సులలో రాబోయే విప్లవంలో ప్రధానపాత్ర వహించగల మనే చైతన్యం కలిగించడం; వారియొక్క దైనందినావశ్యకతలు—వర్గ కలహములోని ప్రాథమిక సూత్రాలు ఆధారంగా చేసుకొని ఆందోళన— నిర్మాణం ఒకేమారు సాగించడం; ఇదే ఈపార్టీయొక్క కార్యక్రమంలో నున్న ప్రత్యేకలక్షణం. ప్రజాసామాన్యానికీ—రాజకీయోద్యమానికీగల ఈ సమ్మేళనంలో-రాజకీయవిప్లవోద్యమానికీ—దైనందిన వర్గకలహానికిగల ఈ సంయోగములోనే, బోల్షివిక్ పార్టీకీ—దాని బలాఢ్యతకీగల మూల సూత్రాలు ఇమిడియున్నాయి.

1895 లో లెనినూ అతనిసహచరులూ "శ్రామికవర్గస్వాతంత్ర్య సంరక్షక సంఘం" అనే పేరుతో సంఘాన్ని ఒకదానిని స్థాపించగలి గేరు. ఇదే తరువాత తరువాత సోషల్‌డెమాక్రటిక్ పార్టీగా మారింది. పీటర్స్బర్గులో అంతకంతకి ఎక్కు అవుతూన్న కూలీల సమ్మెల్ని ఈ యూనియనే నడిపిస్తూండేది. ఆ సంవత్సరమే (1895 లో) లెనిను స్విట్జర్లండుకు పోయి అక్కడ ప్రవాసం ఉంటూన్న "ప్లెఖనోవు"ను కలుసుకొన్నాడు. (ఆనాడే లెనిను ముందుముందు రష్యన్ విప్లవనాయ కుడు కాగలడని ప్లెఖనోవు గుర్తించేడు.) ప్లెఖనోవుతో సమాలోచనలు జరిపేక అంతకంతకి బలపడుతూన్న కార్మికోద్యమాన్ని ఏకముఖం చేసి దానిని నడిపించడం కోసమై "కూలీలపక్షం" (Workers' Cause) అనే కార్మిక పత్రికను రహస్యంగా ప్రకటించడానికి లెనిన్ ప్రయత్నాలు ఆరంభించేడు. కాని ఆపత్రికయొక్క మొదటిసంచిక వచ్చేనాటికి అతడు అరెస్టు చేయబడి ఒక ఏడాది శిక్ష విధించపడ్డాడు. ఆశిక్ష పూర్తిఅయినాక

1900 వరకూ మూడేళ్ళపాటు ప్రవాసశిక్షను అనుభవించడానికై సైబీరియాకి పంపేసేరు. అతడు పీటర్సుబర్గుజైలులో వుండికూడా సమ్మెలు నడిపించడంలో సహాయం చేసేవాడు. జైలులో ఉన్నప్పుడు, ప్రవాసం పోయినప్పుడు, కూడా అతడు ఎన్నో విషయాలను గురించి ఎన్నో వ్యాసాలు వ్రాసేడు. అతడు ఆరోజులలోనే వ్రాసిన "రష్యాలోని పెట్టుబడిదారీవిధానముయొక్క విజృంభణం"అనే గ్రంథం నేటికికూడా సర్వోత్తమముగా పరిగణించబడుతూంది. పీటర్సుబర్గు మార్క్సిస్టుసంఘంలోని విప్లవవాదకక్షిలో ముఖ్యురాలయిన "క్రప్స్కియా" అతనిని ఈ సైబీరియాప్రవాససమయంలోనే కలుసుకుంది. అదిమొదలుగ "లెనిన్" మరణాంతంవరకూ వారిరువురు అవిచ్ఛిన్నంగానే తమజీవికను, విప్లవ కార్యక్రమాన్నీ కూడా నడిపేరు.

1893 లో "మింస్క్" నగరంలో జరిగిన మొదటికాంగ్రెసులో "రష్యన్ సోషల్‌డెమాక్రటిక్" పార్టీ స్థాపించబడింది. ప్రవాసంలోఉండిపోవడంచేత "లెనిన్" ఆసమావేశంలో పాల్గొనలేకపోయేడు. ఉదారవాదకక్షికి చెందిన స్ట్రూవ్ మహాశయుడు ఆసమావేశంలో అనుసరించవలసిన ప్రణాళికను తయారు చేసేడు.

సోషల్‌డెమాక్రటిక్‌పార్టీ నాయకత్వంలో దౌర్బల్యం, గంద్రగోళం ఖయలుదేరింది. 1894–98ల మధ్య లెనిన్‌తోపాటు పనిచేసిన సోషల్ డెమాక్రటిక్‌పార్టీలోని ప్రధాననాయకులంతా జైళ్లలోనో ప్రవాసంలోనో పడియున్నారు. అప్పటిలో నాయకత్వం వహించిన వారంతా గోడమీద పిల్లివాటంగా నడచుకొనేవారే. సరిగ్గా ఈసమయంలో "బెరన్‌స్టీన్"అనే అతడు "విమర్శన స్వాతంత్ర్యం" (Freedom of Criticism) అనే పేరుతో మార్క్సిజాన్ని "సనాతన వాదం" అని నిరసిస్తూ సోషల్ రివల్యూషనరీసిద్ధాంతానికి ఎదురుగా సంస్కారవాద సిద్ధాంతాన్ని లేవదీసి (నిజానికి బూర్జువా అభిప్రాయాలకే ఇది దారి తీస్తూంది.) యూరపు అంతటా తీవ్రమైన ప్రచారం సాగించేడు. యథార్థానికి అతడు ప్రకటిం

చినవి అన్నీ బూర్జువా అభిప్రాయాలే. ఆసమయంలోనే పశ్చిమఐరోపాలో ప్రచారంలోనున్న కొన్ని సిద్ధాంతాల అనుకరణంతో "ఆర్థికవాదం" (Economism) అనే పేరున ఒదుగుబాటుతనం (Opportunism) సిద్ధాంత రంగంలోను, కార్యరంగంలోను కూడ చాలా ప్రాధాన్యత వహించింది. ఈసిద్ధాంతాన్ని ప్రచారంలోకి తెచ్చేవారంతా రాజకీయాలు కార్మికులతలకు మించిన పనులని వాదించసాగేరు. కూలీలు తమ పోరాటం దైనిక ఆర్థిక హక్కులమీదనే కేంద్రీకరించాలనీ, సోషల్‌డెమోక్రట్లు తాము ఏర్పరుస్తూన్న సంఘాలను దానికి తగినట్లుగానే బ్రిటిషుకార్మికోద్యమం మాదిరిగా నడిపించవలెననీ వాదించసాగేరు. ఈఆర్థికపోరాటంనుంచే క్రమంగా రాజకీయచైతన్యం అభివృద్ధి చెంది దానంతట అదే రాజకీయ పోరాటంలోకి పరిణమిస్తుందని వారి వాదన. ఈఅభిప్రాయాలసారాంశం ఏమిటి? రాజకీయ రంగాన్ని బూర్జువాల స్వాధీనం చేసివేయ మనడమే. బ్రిటిషుకార్మికోద్యమంలోలాగే ఇక్కడకూడా కార్మికులు బూర్జువాలకి లొంగిపోవా లనడమే:

ఈ ఒదుగుడు సిద్ధాంతాలనే అనుసరించినట్లయితే సోషల్‌డెమాక్రసీ విప్లవతత్వాన్ని విడిచి బానిసపథాన్ని అనుసరించినట్లే. రష్యాదేశంలోని కార్మికోద్యమంయొక్క భవిష్యత్తు అంతా ధ్వంసమైపోయివుండేది. కనుక "లెనిన్" వెంటనే ఈతప్పుడు సిద్ధాంతాలమీద తీవ్రంగా దండయాత్ర సాగించేడు. రష్యాలో మళ్లీ అడుగుపెట్టగానే ఒక్కవరసన ఈ విషయంమీద వ్యాసాలు వ్రాయడం ఆరంభించేడు. ఈవ్యాసాలన్నీ పోగు చేసి 1902 లో "ఏమి చేయాలి?" అనే పేరుతో పుస్తకరూపంలో ప్రచురించేడు. బోల్షివిజం ఈగ్రంథం ద్వారా కార్మికోద్యమాభివృద్ధికి అవసరమైన ఆయుధాల నన్నిటినీ అందించింది. అందులోని విషయాలు నేటికి కూడా అంతర్జాతీయ కార్మికోద్యమానికి విపరీతంగా సహాయపడుతూన్నాయి.

విప్లవయుతమైన సోషల్‌డెమాక్రసీకి రాజకీయరంగంలో గల ప్రముఖస్థానాన్ని నిరూపించడం ఒకటి! కార్మికవర్గ కలహం దానంతట

అదే సోషలిస్టు చైతన్యం కలిగించి, విప్లవానికి దారితీస్తుంది అంటూ మార్క్సిజం పేరిట వారుచేస్తూన్న ప్రచారం తప్పని బయటపెట్టడం ఒకటి: ఇవే ఆ "ఏమిచేయాలి?" అనే పుస్తకంలో ఉన్న సారాంశం. పెట్టుబడి దారీ తత్వానికి విరుద్ధంగా కార్మికులచేత నడిపించబడే వర్గకలహం క్రమంగా సోషలిస్టుచైతన్యాన్ని కలిగిస్తుంది అనడం వట్టికల్ల. ఆ పని వలన కేవలం పెట్టుబడిదారీ భావాలకి లోనయివుండే కార్మికోద్యమ చైతన్యం మాత్రమే కలుగుతుంది. మార్క్సిజాన్ని-సోషలిస్టుచైతన్యాన్ని —గూర్చి తెలుసుకొవాలంటే సామాజిక నిబంధనలను గూర్చి, సామాజిక పరిణామక్రమాన్నిగూర్చీ, సంపూర్ణమైన శాస్త్రీయజ్ఞానం అవసరం. విద్య ముఖం ఏలా వుంటుందో ఎరగని కార్మికులకి ఆ జ్ఞానం మనం స్వాభా వికంగానే కలుగుతుంది అనడం అబద్ధంకాదు? ఆ జ్ఞానం మనం నేర్ప వలసిందే! సంఘంలో వేరుగా ఒక ప్రత్యేకవర్గంగా మాత్రం నిలిచి పోయి, నిర్ణీతములయిన తమ కొద్ది హక్కులకోసం పోరాడుతున్నంత మాత్రంచేత సోషలిస్టుచైతన్యము కలగదు. చారిత్రకరంగంలో కార్మి కులకు వుండే ప్రాముఖ్యతను గుర్తింపచేసే విప్లవచైతన్యము అంత కంటె కలగదు. కార్మికులు సామాజిక పరిణామక్రమంలో నాయకులు అవాలి. పీడితవర్గాలు జరిపే పోరాటంలో నాయకత్వం వహించాలి. పురాతన సమాజాన్ని కూలద్రోసి, నూతనసమాజాన్ని నిర్మించేటందుకై తమ పోరాటాన్ని సాగించాలి. ఆనాడే వారికి ఆ విప్లవచైతన్యమూ— సోషలిస్టుచైతన్యమూ కలుగుతుంది. "సోషల్ డెమాక్రటిక్ పార్టీ" నాయ కులు కార్మికులలో ఈ చైతన్యం బయలుదేరేటట్లు చూడాలి. ఇదేసోషల్ డెమాక్రసీ చేయవలసిన పని. ప్రత్యేకములు, పరిమితములు, సంకుచిత ములు అయిన కార్మికవర్గ సౌకర్యాల పేరిట పనిచేసినంత మాత్రంచేత సంతృప్తిపడి "సోషల్‌డెమాక్రట్లు" ఊరుకోకూడదు. వారుచేసే ప్రతి ఒక ఆందోళన, వారు నిర్వహించే ప్రతి ఒక నాయకత్వమూ సమాజంలోని రాజకీయసమస్య లన్నింటిమీదికీ గురిచేయబడాలి. ప్రస్తుత సామాజిక

విధానాన్ని ప్రతివిషయంలోను ఎదిరించి పోరాడాలి. పూర్వకాలంనాటి, అసంపూర్ణములయిన, సంఘనిర్మాణాలు, కార్యవిధానాలు ఈ పని నిర్వహించలేవు. బ్రహ్మాండమైన యంత్రోత్పత్తితో పోటీ చేయడానికై ఆదిమ కాలంనాటి చేతిపనుల్ని ఉపయోగంలో పెడితే ఎంత అసందర్భంగా వుంటుందో ఆలాగే వుంటుంది, నేటి రాజ్యాంగ విధానంతో పోరాడడానికి పూర్వపు పనిముట్లని ఉపయోగించడం. సోషల్ డెమాక్రసీ ప్రజాతంత్ర పద్ధతులమీద నడుపబడుతూ క్రమశిక్షణగల కేంద్రసంస్థగామార్చబడాలి. ప్రస్తుత సమాజవిధానంమీదికి అడుగడుగులోను.—ప్రతివిషయంలోను, కార్మికుల్ని నడిపించగల సమర్థులు, సుశిక్షితులు, అనుభవజ్ఞులైన విప్లవకారులచేత ఆపార్టీ నడిపంచబడాలి.

ప్రస్తుతపు పోరాటంలోని సమస్యలన్నిటిని మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలిస్తూ వివరించబడిన, తీవ్రములయిన, ఈ విప్లవభావాలు సోషల్ డెమాక్రట్లలో గొప్ప సంచలనం కలిగించేయి. ఈ ఆశయాల మీదనే లెనిన్‌చేత బోల్షివిక్‌పార్టీ నిర్మించబడింది. వీటిననుసరించే రష్యాలోని శ్రామికవర్గ విప్లవోద్యమం శిక్షణ పొందింది. ఆ శిక్షణయొక్క ఫలితం నేడు కనిపిస్తూనేవుంది. రష్యాదేశపు శ్రామికవర్గం విప్లవాదర్శాన్ని సాధించింది. నేడు తన దేశాన్ని తాను పాలించుగుంటూ నూతన సమాజ నిర్మాణాన్ని సాగిస్తూంది. పశ్చిమయూరపులోను, అమెరికాలోను, శ్రామికవర్గం చిరకాలాన్నుంచి ఉద్యమంసాగిస్తూవున్నా, నేటి వరకు దాస్యంలోనే మునిగి పడివుండవలసి వచ్చింది.

## బోల్షివిజం : మెన్షివిజం.

ఒదుగుబాటుదనంతో దీర్ఘయుద్ధం జరిపి, సోషలిస్టువిప్లవకోసం ప్రయత్నించడమే లెనిన్ రాజకీయజీవితంలో గల ప్రధానాంశం. (అవసరం వచ్చినప్పుడు క్రియాశూన్యమైన అతివాదపక్షాలమీద కూడా అతడు తన దండయాత్ర సాగించేడు.) సోషల్‌డెమాక్రసీలోని (Opportunism) ఒదుగుబాటుతనంతో జరిపే పోరాటం మీదనే రష్యా కార్మికవర్గం

యొక్క భవిష్యతు ఆధారపడివుంది. ఈవిషయంలో ఏమరి వుండడానికి వీలులేదు. అతడు 1894 లోరాజకీయరంగంలో అడుగు పెట్టినది మొదలు 1917 లో విప్లవం విజయవంతం అయ్యేవరకూ అతడు ఈ పోరాటాన్ని నిరంతరాయంగా నడిపిస్తూనే వచ్చేడు. విప్లవకరమైన ప్రజాపక్షం నిర్మించాలంటే ఈపోరాటం జరపకతీరదని అతడునమ్మేడు. ఆ నమ్మకం కలిగేక నిర్భయంగా, నిర్దయగా, కొసవరకు నిరంతరాయంగా పోరాడేడు. ఈపోరాటంయొక్క ఆవశ్యకత అతవి శిష్యులు కానివారిలో చాలా కొద్దిమందికి మాత్రమే అర్ధం అయింది. అంతర్జాతీయ సోషలిస్టునాయకులలో పెక్కుమంది "లెనిన్" నిర్వహిస్తూన్న ఈవిధానం పట్టి వంకెత్తుతనం అని నిరసించేరు. క్రియాశూన్యత అనీ, మాటలకోసం పోరాడడం అనీ, పార్టీలో భేదాలు పెంచడంఅనీ నిందించేరు. వారంతా పేచీలు పడుతూన్న రెండుపక్షాల్నీ కలుపుమంటూ మాట మాటకీ తయారు అయ్యేవారు. కాని ప్రతిమారుకూడా "లెనిన్" వారి ప్రయత్నాలను సగౌరంవంగా దృఢనిశ్చయంతో తిరస్కరించేవాడు. నిజం ఆలోచిస్తే లెనిన్ ఎన్నుకొన్న మార్గం చాలా కఠినమైనదే; కాని అతనికి తాను చేస్తూన్నదేమిటో బాగా తెలుసును. తాను అనుసరించే మార్గానికీ, వారు చెప్పే ఒంకెత్తుతనానికీ, అసలు సంబంధం లేదని అతడు ఎరుగును. తన సిద్ధాంతం క్రియాదూరం కాదని అతనికి విశ్వాసం ఉంది. విప్లవచైతన్యం గల ప్రజాపక్షం అనుసరించవలసిన మార్గం ఇదేనని అతడు ఎరుగును. కార్యరూపంలోనికి వచ్చేటప్పటికి అతని ఉద్దేశ్యాలే సరియని తేలిపోయింది. అంత సూక్ష్మంగా, అంత విమర్శనతో, కార్యక్రమం నిర్ణయించుకొని, ఎత్తుగడలు సిద్ధం చేసుకొని నిర్మాణం బలపరుచుకుంటూ రావడం చేతనే బోల్షివిక్‌పార్టీ నేడు ప్రపంచంకెల్లా పెద్ద ప్రజాపక్షంగా తయారయింది.

"లెనిన్"కీ ఇతరులకీ మధ్య బయలుదేరి, ప్రపంచవిఖ్యాతములయిన ఈ భేదాలన్నీ కరడుకట్టి క్రమంగా బోల్షివిజం: మెన్షివిజంగా

మారేయి. ఆర్థికవాదులతోటీ (Economists) మార్క్సిస్టు మితవాదుల తోటీ జరిపిన పోరాటంలోనే ఈ భేదానికి బీజాలు సూచన మాత్రంగా వున్నాయి. కాని అవి 1903 లో జరిగిన రష్యను సోషల్‌డెమాక్రటిక్ పార్టీయొక్క రెండవకాంగ్రెసు నాటినుంచే స్పష్టంగా బయటపడ్డాయి.

ఈ వివాదం ఎందుకు వచ్చింది? చెదురుచెదురుగాయున్న చిన్న సంఘాల నన్నింటినీ ఏకముఖం చేసి, కేంద్రసంఘాన్ని నిర్మించడంలో సహాయకరంగా వుండేటందుకు కేంద్రపత్రికను స్థాపించి, సమిష్టిగా ఆందోళనచేసి, సమిష్టినిర్మాణం సాగించాలని, "లెనిన్" తను వ్రాసిన "ఏమి చేయాలి?" అనే గ్రంథంలో బాగా వివరించేడు. ప్రవాసంనుంచి తిరిగిరాగానే "లెనిన్" తానే ఈ పనికి పూనుకున్నాడు. ఆనాటికి రష్యా లోగల పార్టీనాయకులలో లెనిన్—మార్టోవు—పెట్రోసోక్కవులుప్రధానులు. వీరు ముగ్గురూ ప్రవాసంలోయున్న పురాతననాయకులయిన ప్లెఖనోవు—అక్సెల్రాడ్—వీరాజెస్సూలిచ్ వగైరాలను కలుసుకొని పత్రికా ప్రకటన విషయం నిశ్చయించవలెనని విప్లవాదకక్షికిచెందిన సోషల్‌డెమాక్రట్లు (Pskov) నగరంలో సమావేశం అయినప్పుడు తీర్మానించేరు. 1900 లో విదేశాలనుంచి "ఇస్క్రా" అనే పేరున కేంద్రపత్రిక వెలువడింది. 1900—07 వరకు "ఇస్క్రా" పార్టీని, రాజకీయకార్యక్రమాన్ని నిర్మించడంలో ఎంతో సాయం చేసింది. ఆ పత్రిక చేసినపని, ఏర్పాటుచేసిన సంబంధాలద్వారా 1907 లో సోషల్‌డెమాక్రటిక్‌పార్టీయొక్క ప్రతినిధి సభను పిలవడానికి అవకాశాలు లభించేయి. సభకు నలభైనలుగురు ప్రతినిధులు మొత్తం 26 సంఘాలనుంచి వచ్చేరు. వారిలో నలుగురు కూలీలు, ఈసభ మొదట బస్సెల్సులో కూడింది. కాని అక్కడనుంచి పోలీసులు తరమడంచేత లండనులో తిరిగి సమావేశమయింది.

ఈ సమావేశానికి అభివృద్ధి నిరోధకులయిన "ఆర్థికవాదులు" (Economists) "జీయిష్—బండ్"ల కంటె (యూదుశాఖ, వీరు కేంద్ర సంఘంలో చేరడానికి అంగీకరించలేదు.) "ఇస్క్రా" పక్షంవారే చాలా

ఎక్కువమంది వచ్చేరు. కాని, "ఇస్క్రా" పత్రిక వచ్చినవారిలోకూడా అభిప్రాయభేదాలు కలిగేయి. ఈఅభిప్రాయభేదమే తరువాత బోల్షివిజం, మెన్షివిజంగా మార్పు చెందింది. సంపాదకీయ వర్గంలోనికీ, సెంట్రలు కమిటీకీ కూడా అధికసంఖ్యాకులుగా ఎన్నుకోబడిన బోల్షివికులకి లెనిను నాయకుడు. ప్రప్రథమాన "ప్లెఖనోవు" కూడా వీరితోనే వుండేవాడు. ఆనాటినుంచీ వీరు అధిక సంఖ్యాకులు (బోల్షివికి) అయ్యేరు. మార్టోవుచే నడపబడిన మెన్షివికులు అల్పసంఖ్యాకులై పోయేరు. నిజం ఆలోచిస్తే ఈతేడా అంత పెద్దదికాదు. సమావేశంలో ప్రధాన చర్చనీయాంశాలలో ఒకటయిన పార్టీనియమావళి విషయంలో మెన్షివికులదే పైచేయిఅయింది. అదీగాక సమావేశం పూర్తి అయిన కొద్దిరోజులకే "ప్లెఖనోవు" మెన్షివికులలో చేరిపోయేడు. పార్టీనాయకత్వం విషయంలో "లెనిన్" ఒంటిగాడు అయిపోవడంచేత "ఇస్క్రా" నుంచి రాజీనామానిచ్చి Vperiod "ఫార్వర్డు" అనేపేరున కొత్త పత్రికను ఒకదానిని స్థాపించుకోవలసి వచ్చింది. బోల్షివికుపార్టీని నిర్వహించుకొనడంకోసం "అధిక సంఖ్యాకుల సంస్థ" నొకదానిని స్థాపించవలసివచ్చింది. పరిస్థితులు ఈలాగ వుండగా 1905 లో లండనునగరంలో పార్టీయొక్క మూడవ కాంగ్రెసు సమావేశం అయింది. ఈకాంగ్రెసు పూర్తిగా బోల్షివికులదే. అక్కడ చేయబడిన తీర్మానాలన్నింటిలో బోల్షివికుపార్టీవారి ఎత్తుగడలే ప్రప్రథమంగా, సంపూర్ణంగా, స్పష్టంగా, అవలంబించబడ్డాయి.

మెన్షివిక్కులకి—బోల్షివిక్కులకి గల ప్రధానభేదా లేమిటి? అసలు భేదాలు ఎన్నోవిషయాలలో కలిగేయి. కాని వానిలో ప్రత్యేకంగా;

1. విప్లవ స్వభావనిర్ణయంలో: రష్యాలో జారుప్రభుత్వాన్నీ, భూస్వామ్య విధానాన్ని, అంతరింపచేసి, బూర్జువా డెమాక్రటిక్ విప్లవం సమాప్తి చేసినాక, పశ్చిమ యూరపుఖండంలోవలెనే రష్యాలోకూడాజారు అనంతరం ప్రభుత్వాధికారమూ—పరిపాలనా విధానమూ కూడా బూర్జువాలదే అయివుండాలనీ, ఆ విప్లవంలో శ్రామికవర్గంయొక్క స్థానంబూర్జు

వాలకు సహాయం చేయడంవరకేననీ; వారు బూర్జువాప్రభుత్వంనుంచి ఏవో కొన్ని సౌకర్యాలు సంపాదించుకొనేటందుకు ప్రయత్నించేటంత మాత్రంగానే ఉండిపోవాలనీ మెన్షివిక్కులు అభిప్రాయపడ్డారు. విప్లవం బూర్జువాల నాయకత్వం క్రిందగాక రైతులతో కలిసిన కార్మికవర్గం యొక్క నాయకత్వం క్రిందనే నడిచి విజయం పొందాలనీ; జారు అనంతరం కూలీలకీ-రైతులకీమాత్రమే ప్రాతినిధ్యం ఉండే విప్లవకర నియంతృత్వాధికారాన్ని స్థాపించేటందుకే ఆ శ్రామికవర్గం పోరాడవలసి యుంటుందనీ బోల్షివిక్కులు వాదించేరు.

2. బూర్జువా ఉదారవాదులతో పెట్టుకోవలసిన సంబంధం: కార్మిక వర్గంయొక్క కోరికలు గుర్తించే కల్పంలో బూర్జువా ఉదారవాదులతో చేతులు కలుపవచ్చునంటారు మెన్షివిక్కులు. పరిస్థితుల్నిపట్టి ఎత్తుగడలు అన్నింటినీ ఉపయోగించుకొనేటందుకు సిద్ధంగా వున్నా బూర్జువాఉదార వాదులయొక్క అభివృద్ధినిరోధకస్థితినీ, వారి అభిప్రాయాల నిజస్వభా వాన్నీ, నిర్మొగమాటంగా బయట పెట్టితీరాలి అటాంరు బోల్షివిక్కులు.

3. పార్టీనిగూర్చిన అభిప్రాయం: అవసరం వచ్చినప్పుడు విస్తృ తం కావడానికి వీలయ్యేటట్లుగా పార్టీ ఉండాలనీ; రహస్య సంఘాలలో సభ్యులు కాకపోయినా—ఆ సంఘాల ఆధీనంలో వుండి పనిచేస్తూ వాని కార్యక్రమాన్ని అభిమానించే (విడివిడిగాయున్న Intelligentsia)వ్యక్తులు సభ్యులు అయ్యేటందుగు తగిన వీళ్లు కల్పించాలనీ మెన్షివికులుకోరేరు. దీనికి ఫలితం ఏమి తేలుతుందంటే—విప్లవకరకార్యాలతో ప్రత్యక్షసం బంధం పెట్టుకుంటే వచ్చే కష్టనిష్టురాలకు జంకి-కేవలం అభిమానులుగా వుండేవారిని కూడా చేర్చుకోవలసివస్తుంది. ఇటువంటి వారికి పార్టీలో స్థానం ఉండకూడదనీ; ఉంటే పార్టీ బలహీనం అయిపోతుందని; పార్టీ నిర్మాణాలలో బాధ్యతగలిగి పనిచేసేవారు మాత్రమే పార్టీలో సభ్యులుగా ఉండాలనీ; ఈ పద్ధతిని అవలంబించుతేనే పార్టీ ఆచరణలో విప్లవకరమై, సుశిక్షితమై ఉంటుందనీ; బలహీనులకీ-బద్ధకస్తులకీ- సంశయాత్ములకీ-చోటులేని ద్రుఢమైనపార్టీగా వుండగలదనీ; బోలివిక్కులు పటుపటేరు.

ప్రారంభదినాల్లో బోల్షివిజాన్నీ-మెన్షివిజాన్నీ వేరుపరచిన సమస్య లలో ఇవి కొన్నిమాత్రమే. మార్క్సిస్టు విప్లవవాదానికీ సంస్కార వాదానికీగల తేడా-జరగవలసిన పోరాటం కార్మికవిప్లవమా? లేక పెట్టు బడిదారీవిధానాన్నే అనుసరించాలా అనే సమస్య పై అభిప్రాయభేదాల లోనే సూక్ష్మంగా—అస్పష్టగా కనిపిస్తున్నాయి. తరువాతసంవత్సరాలలో ఈ భేదం అంతకంతకి ప్రబలం అయిపోయింది. యుద్ధం రోజులలో మెన్షివిజం జాతీయరక్షణవిధానాన్ని అనుసరించింది. అంటే సామ్రాజ్య వాదులకి సహాయం చేయడానికే నిశ్చయించింది. 1917 లో మార్చి విప్లవం పూర్తి అయినాక ఏర్పడిన బూర్జువా మంత్రివర్గాలలో మెన్షివి కులు చేరి సామ్రాజ్యవాదానికి చేయూతనిచ్చి బోల్షివిక్కులను జైళ్ళలో త్రోసివేసేరు. ఇంక ఆఖరున బోల్షివికులు ప్రభుత్వాధికారం స్వాధీనం చేసుకొన్న తర్వాత సాయుధప్రతి-విప్లవం (Counter-Revolution) లేవ దీసి ఈ మెన్షివికులే కార్మికప్రభుత్వంమీదనే బహిరంగంగా యుద్ధం ప్రకటించి సమ్రాడ్వాదులతోనూ (Monarchist) బూర్జువాలతోనూ చేరి విప్లవానికి ప్రాతికూల్యత వహించేరు.

1905 లో జరిగిన మొదటి రష్యావిప్లవం సిద్ధాంతంలోను, ఎత్తు గడలలోనుగల సమస్యల నన్నింటినీ ప్రయోగంలో పెట్టి ఎంతవరకు ఆచరణీయాలో పరీక్షచేసి చూసి, 1917 నాటి విప్లవానికి బాట సరిచేసింది. కార్మిక-కర్షకులయిన ప్రజాసామాన్యమునందలి యుద్ధశక్తి జారిజాన్ని గడగడలాడించి కాళ్ళబేరానికి తీసుకురాగలదనే విషయం ఇచ్చట స్పష్టం చేయబడింది. వర్గచైతన్యం పొందినకార్మికులు, వారిసంఘాలు, ఈ పోరాటంలో నాయకత్వం వహిస్తారని స్పష్టపడింది. భయంతో వెనక ముందాడుతూ పర్యవసానంలో విప్లవప్రతికూలురుగామారిపోయేబూర్జువా ఉదారవాదులు మంచి చిక్కువేళ జారుప్రభుత్వంతో సంధి చేసుకొనే టందుకు సిద్ధం అవుతారని తెలిపోయింది. సమ్మెఆందోళన సర్వవ్యాప్త మైన రాజకీయసమ్మెగా మారి, దానిలోనుంచి సాయుధవిప్లవం బయలు

దేరుతుందనే విషయం తేలిపోయింది. పోరాటంయొక్క పద్ధతులలోను, వివిధదశలలోను కలిగిన ఈ నూతనానుభవం అంతర్జాతీయ సోషల్ డెమాక్రాట్లలోపై రుధ్యాలనూ, తీవ్రమైన నూతనచైతన్యాన్నీ కలిగించింది.

ఆనాటికి ఇంకా మార్క్సిస్టు విప్లవసిద్ధాంతాలకోసమే పోరాడుతూన్న "కాట్స్కీ" మొదలయిన ఇంటర్నేషనల్ సోషలిస్టు సిద్ధాంత వేత్తలు ఆ సమయానికే ఇంటర్నేషనల్ సోషలిస్టు విప్లవనాయకత్వం రష్యను కూలీల చేతులలోనికి జారిపోతున్నట్లు గుర్తించేరు. 1905 లో పీటర్సుబర్గు—మాస్కో మొదలయిన ప్రదేశాలలో కార్మికప్రతినిధులతో కూడిన కౌన్సిళ్ళు, సోవియట్లు బయలుదేరినాయి. ఇవే భవిష్యత్తులో పరిణతిచెంది, కార్మికప్రభుత్వవిధానంలో ప్రధానాంగా లయినాయి.

పరస్పరవిరుద్ధంగా ఉండే బోల్షివికుల ఎత్తుగడలు. మెన్షివికుల ఎత్తుగడలు, రెండుకూడా 1905 లో బాగా ప్రదర్శించబడినాయి. బూర్జువాలు విప్లవంలో నాయకత్వం తీసుకొనేటట్లు వారిమీద కార్మికులు ఒత్తిడి తేవాలని మెన్షివికుల వాదన, కూలీలు స్వతంత్రంగా నాయకత్వంవహించి ముందుకు సాగిపోవాలని బోల్షివికుల వాదన. వీరు సమ్మెలకి రాజకీయ చ్ఛాయ నిచ్చేరు. భూమికోసం పోరాటం సాగిస్తూన్న రైతుల్ని రాజకీయ పోరాటంలోకి ఆకర్షించడానికై వీరు ఒక రైతుప్రజాశిక తయారుచేసేరు. భూమిని పండించేటందుకు సంఘాలు ఏర్పరచేరు. డెసెంబరు నెలలో మాస్కోనగరంలో ఆరంభం అయిన సాయుధ విప్లవంతో ప్రజాపోరాటం పారంముట్టింది. ఈ విప్లవం బోల్షివికులచేత నడిపించబడుతూన్న మాస్కోసోవియటు ఆధీనంలో నడిచింది. ఈ విప్లవప్రవాహంముందు పదిరోజులదాకా జారుప్రభుత్వ సైన్యాలు కాలు నిలుపలేకపోయినాయి. ఆఖరుకి రక్తప్రవాహాల మధ్య అణచివేయబడిన ఈ సాయుధవిప్లవం సమయోచితం కాదనీ, తప్పనీ, మెన్షివికులు నిందించసాగేరు. ఆనాటి విప్లవంలో ఎత్తుగడలవిషయంలో చేసిన పొరపాట్లను లెనిన్ విమర్శిం

చేడు. కాని, ఆ సాయుధవిప్లవం ఆరంభించడం తప్పుకాదని నిరూపిం చేడు. "రష్యావిప్లవం సాధించిన మహత్తర చారిత్రక సాధన" అనీ, భవిష్యద్విజయానికి మార్గదర్శకం అనీ చెప్పేడు, ఆ సాయుధ విప్లవం.

జారుప్రభుత్వం తాత్కాలికంగా విజయం పొందింది. అభివృద్ధి నిరోధకమైన జారుప్రభుత్వం ప్రజాప్రతినిధి ప్రభుత్వాలయిన ఫ్రాన్సు—ఇంగ్లాండులు పెట్టిన పెద్దపెద్ద అప్పుల సహాయంతో మళ్లీ కాలు నిలవ తొక్కుకుంది. ఫ్రాన్సు—ఇంగ్లండుల ధనసహాయమే లేకుంటే జారిజం ఆనాడే తప్పకుండా కూలిపోయి వుండేది. విప్లవం ఓడిపోగానే ప్రభుత్వ ప్రతికక్షులమీద తీవ్రప్రతిహింస ఆరంభం అయింది. తాను దగ్గరగావుండి విప్లవాన్ని నడిపించడానికై 1905 లో రష్యాకు తిరిగివచ్చిన "లెనిన్" నిరోధశాసనాల ఒత్తిడికి 1907 తో మళ్లీ విదేశాలకి వెళ్ళిపోయేడు.

ఆ ప్రతిక్రియాసమయంలో బోల్షివిక్కులు అనేకవిధాలయిన ఎత్తుగడల నవలంబించవలసివచ్చింది. ఎంతో ఓరిమి వహించి చేతికి దొరికిన ప్రతి చిన్న అవకాశాన్నీ ఉపయోగించుకుంటూ, పట్టుదలతో ప్రజలలో పనిచేయవలసివ చ్చింది. ఎంతోమంది అధైర్యపడి రంగంలోంచి జారిపోయేరు. ఈసమయంలో ఎక్కువగా నష్టపడినది బోల్షివిక్ పార్టీయే. ఆపార్టీసభ్యు లెంతోమంది చంపబడ్డారు. లెక్కలేనంతమంది జైళ్ళలోకి త్రోసివేయబడ్డారు. బోల్షివికులపై పగతీర్చుకొనబడుతూన్న ఈ సమయంలో మెన్షివికులు ముందుకు వచ్చేరు. వెంటనే వారు ప్రస్తుతంవిప్లవ కార్యక్రమానికి ఎక్కడా సావకాశం లేదంటూ ప్రకటించేరు. రహస్య విప్లవపక్షం రద్దుచేయాలన్నారు. (Liquidate) దానికి బదులుగా చట్ట విరుద్ధములు కాని ట్రేడు—యూనియన్లనీ. ఏవో కొద్ది సంస్కరణాల కోసమే పోరాడుతూ పరిమితమైన కార్యక్రమంతో నడపబడే కార్మిక పక్షాన్ని నిర్మించడంలోనే బాగా ప్రయత్నం చేస్తామన్నారు. లెనిన్ ఒక మూల మెన్షివికుల అభిప్రాయాలతో పోరాటం నడుపుతూనే ఇంకోమూల తమ పార్టీలోని అతివాదులతోకూడా యుద్ధం చేయవలసివచ్చింది. ప్రతి

క్రియాసమయంలో చేతచిక్కిన ప్రతి శాసనానుకూల కార్యావకాశాన్నీ వినియోగించుకొనవలసిన అవసరాన్ని గుర్తించలేక ఈ అతివాదులు అభివృద్ధినిరోధకంగా యుండే మూడవ డ్యూమాను బహిష్కరించాలని పోరాడసాగేరు. (ఈ సిద్ధాంతాన్నే "ఓట్జోవిజం" అంటారు.) కొంత మంది అతినవీనములుగా కనబడే బూర్జువా భావాల మధురపద్ధతులను అనుసరిస్తూ తమదృష్టిలో పాతబడిపోయినట్లు కనుపించిన మార్క్సు-ఏంగిల్సుల సిద్ధాంతాలు సరిచేయాలంటూ మొదలుపెట్టేరు. నిజానికి వీరు అనుసరిస్తూన్నది పూర్వకాలపు బూర్జువా భావాలే. బాధ్యతతోకూడుకున్న రాజకీయ నాయకత్వం వహించిన "లెనిన్" ఈభావాలవలన గలుగగల ఆపదలను గుర్తించి ఈ తాత్త్వికప్రశ్నల కన్నిటికీ సమాధానం ఇస్తూ, 1905 లో "భౌతికవాదము: సామ్రాజ్యతత్త్వ విమర్శన" (Materialism: Empirio Criticism) అనే పుస్తకం వ్రాసేడు. నేటికికూడా ఈపుస్తకం గతితార్కిక భౌతికవాదాన్ని గూర్చి తెలుసుకోదలచిన వారందరికీ ఎక్కువగా ఉపయోగపడుతూంది.

ప్రతిక్రియా కాలమైన 1906—11 ల మధ్య లెనిన్ నాయకత్వం క్రింద బోల్షివికులు ఒక్క ప్రభుత్వంతోనే గాక "లిక్విడేషనిస్టు"ల తోటీ, "ఓట్జోవిస్టు"ల తోటీ కూడా ఒకేమారు పోరాడవలసివచ్చింది. ఇల్లాంటి వ్యతిరేక పరిస్థితులలో కూడా బోల్షివిజం భీషణప్రతిహింసా ప్రవాహంలో తుడిచిపెట్టుకుపోవడానికి బదులు, కార్మికవర్గంలో వేళ్లుబారి పారిశ్రామిక కూలీలలో అధికసంఖ్యాకుల్ని తన నాయకత్వం క్రిందికి తెచ్చుకోగలిగింది. మెన్షివిక్ పార్టీనాయకుడైన T. డాన్ ఈ కాలంనాటి సంగతుల్ని గూర్చి తన పార్టీయొక్క చరిత్రలో ఈక్రింది విధంగా వ్రాసేడు.

"పార్టీలోని బోల్షివిక్‌పక్షం వ్యూహంమాదిరిగా అభేద్యంగా నిలబడి ఒకేఒక దృఢనిశ్చయంతో కఠినమైన క్రమశిక్షణకి కట్టుబడియుండగా; మెన్షవిక్‌పార్టీసభ్యులు ఒక నిశ్చయం లేక కలహాలతో పూర్వంకన్న అధికంగా వికావికలైపోయేరు.

(T. Dan, 'Social Domocracy in Russia after 1908: Appendix to Martov's 'History of Russian Social Democracy; Berlin 1926.)

1911 లో కేవలం బోల్షివికుల నాయకత్వం క్రిందనే నూతన యుద్ధతరంగం బయలుదేరిన రోజున ఈ తీవ్రపోరాటానికీ, ప్రజలలో చేసిన ప్రచారానికీ ఫలితాలు కనిపించేయి. 1912 జనవరిలో జరిగిన బోల్షివిక్ కాంగ్రెసులో బోల్షివికులకీ—మెన్షివికులకీ మధ్య బయలుదేరిన అభిప్రాయభేదాలు తీవ్రరూపం ధరించేయి. అంతవరకూ ఒకే పార్టీలో రెండుశాఖలుగా యున్న ఉభయపక్షాలూ విడిపోయినాయి. ఆసంవత్సరం డ్యూమాకి వెళ్ళగలిగిన మెన్షివిక్ పార్టీ సభ్యులు 7 గురు. 2,14,000 మంది కూలీలు మాత్రమేగల జిల్లాలనుంచి వీరు ఎన్నుకోబడ్డారు. 10,08,000 మంది కార్మికులున్న పారిశ్రామిక కేంద్రములనుంచి 5గురు బోల్షివిక్ ప్రతినిధులు డ్యూమాకి ఎన్నుకోబడ్డారు. 1912 లోనే ప్రారంభించబడిన బోల్షివికు పార్టీయొక్క దైనికపత్రికయైన "ప్రవద" కు గల చందాదార్లలోను, మెన్షివిక్ పత్రిక చందాదార్లలోను గల కూలీలయిన వారి సంఖ్యలోకూడా అదే తేడా. "ప్రవద"కి 5 గురు వుంటే మెన్షివిక్ పత్రికకు ఒక్కడు. (నిజానికి ప్రభుత్వం అంగీకరించిన పత్రిక అది ఒక్కటే కావడంచేత మెన్షివిక్ పత్రికకి ఆమాత్రం చందాదార్లయినా కూలీలనుంచి వచ్చేరు.) 1914 నాటికి బోల్షివికులు కూలీలలో నూటికి ఎనభై మందిని—వర్గచైతన్యం పొందినవారిని కూడకట్టుకో గలిగేరు. మెన్షివికులు చేపట్టకలిగింది మిగిలిన ఆ ఇరవై మందిని మాత్రమే.

1912 నుంచి 1914 వరకూ అంతకంతకు ఎక్కువ అవుతూ వచ్చిన ప్రజాపోరాటాన్ని రష్యాసరిహద్దులలోనేవున్న "గెలీషియా" లో వుండి "లెనిన్" నడిపించేడు. 1914 లో ఇంక యుద్ధం ఆరంభం అవుతుంది అనగా రష్యాలో విప్లవచిహ్నాలు కనిపించేయి. పీటర్సుబర్గులో గొప్ప గొప్ప సమ్మెలు బయలుదేరి ఆఖరుకి కూలీలు వీధులకి అడ్డు కట్టి

తిరుగుబాటు చేసేటంత స్థితికి వచ్చేరు. సామ్రాజవాదయుద్ధం ఆవిప్లవ ప్రవాహాన్ని తాత్కాలికంగా మరలించకలిగింది. కాని 1917 లో వచ్చి నప్పుడు దానివేగం బలం అనేకరెట్లు పెచ్చుపెరిగింది.

ప్రపంచయుద్ధం: విప్లవయుత అంతర్జాతీయత.

ప్రపంచయుద్ధం జరిగిన 1914–18 సంవత్సరాల మధ్యకాలం ఒక యుగసంధి. పెట్టుబందారీవిధానం చిక్కులలోపడి కూలిపోయే రోజు దగ్గరపడిందనీ, సోషలిస్టు విప్లవం ఆరంభించవలసిన సమయం ఆసన్నం అయిందనీ ఈ సంధికాలం సూచిస్తూంది.

"లెనిన్" నాయకత్వాన బలంగాను, దృఢతరంగాను, తయారైన బోల్షివిక్‌పార్టీ సామ్రాజ్యవాద ప్రభుత్వాలు అన్నిటిలోకి బలహీనమైన రష్యా దేశంలో 1917 లో విప్లవాన్ని లేవదీసింది.

లెనిన్‌జీవితానికీ, ఆధునికచరిత్రకీకూడా ఈసమయంసంధికాలమే.

1907, 1910, 1912 లలో జరిగిన సమావేశాలలో సోషలిస్టు ఇంటర్నేషనలు యుద్ధసమస్యమీద తన నిశ్చయాన్ని ఈవిధంగా ప్రకటించింది.

"ఒకవేళ యుద్ధం ప్రారంభం అవుతుందని తోస్తే ఆ యా దేశాల కార్మిక వర్గము, కార్మికవర్గం తరఫున పార్లమెంటులలోకి వెళ్ళిన సభ్యులు, సోషలిస్టుఇంటర్నేషనలుయొక్క సహాయం తీసుకుంటూ, ఆ యా దేశాలలోని సాధారణరాజకీయ పరిస్థితుల్నీ, వర్గకలహానైశిత్యాన్నీ, మనస్సులో పెట్టుకొని ఉచితములని తోచిన ఉపాయాలన్నీ ప్రయోగించి యుద్ధం నిలవడానికి తమ శక్తుల నన్నిటినీ వినియోగించాలి.

"యుద్ధం ప్రారంభం అయితీరుతే తామంతా కలుగచేసుకొని ఆయుద్ధం అంతమయ్యేలాగ చూడాలి. యుద్ధం కారణంగా బయలుదేరిన ఆర్థిక-రాజకీయ సంక్షోభాలను ఉపయోగించుకొని, ప్రజలను రెచ్చగొట్టి, పెట్టుబడిదారీవర్గాల ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి తమ శక్తులన్నీ వినియోగించి పనిచేయాలి"

యుద్ధం అంటూ వస్తే సోషలిస్టులు చేయవలసిన పని ఏమిటో రెండవ ఇంటర్నేషనలుయొక్క ఈతీర్మానం నిర్దిష్టంగా వివరించింది.

యుద్ధకాలంలో విప్లవవాదులైన సోషలిస్టులంతా ఈ తీర్మానాన్నే అనుసరించేరు. దీనిని తయారు చేసినవారు, లెనినూ, రోజా లక్జెంబర్గూను. రష్యాబోల్షివికుపక్షప్రతినిధిహోదాలో రోజాలక్జెంబర్గ దీనిని యుద్ధతీర్మానానికి సవరణగా ప్రవేశపెట్టింది. సమావేశంలో పాల్గొన్న అన్ని పక్షాలూ, ఆఖరుకి బ్రిటిషులేబరుపార్టీకూడా ఈతీర్మానాన్ని ఏకగ్రీవంగా అంగీకరించేయి. ఈ తీర్మానం ద్వారా "లెనిన్" రెండవ "ఇంటర్నేషనలు'' లోని సోషలిస్టుపార్టీలమీద తన నాయకత్వాన్ని స్థిరపరచుకొన్నాడు. కాని అతడు చూపిన మార్గాన నడుస్తూన్నవారిలోనే పెక్కుమందికి తాము అనుసరిస్తూన్న మార్గం వేసినది ఫలానావాడని తెలియనేతెలియదు.

1914 లో యుద్ధం ప్రారంభం కావడంతోటే వెనుక చేసిన తీర్మానాల్ని కార్యరూపంలోకి తేవలసిన అవసరం వచ్చింది. ఆ అవసరం ఆసన్నం అయ్యేటప్పటికి రెండవ ఇంటర్నేషనలు కూలిపోయి ఊరుకుంది. ప్రధానదేశాలలోని సోషలిస్టుపార్టీలలో అధికభాగం ఒదుగుబాటుతనాన్నీ, (Opportunism) శాసనానుకూలవాదాన్నీ, (Legalism) అనుసరించి పెట్టుబడిదారుల ప్రభుత్వాలతో సరిపెట్టుకోవడంవలన శిథిలం అయిపోయినాయి. ఆ పార్టీల నాయకత్వం ఏనాడో విప్లవతత్వాన్ని వదిలివేసింది. యుద్ధం ఆ విషయాన్ని బయటపెట్టింది. బ్రిటను, ఫ్రాంసు, జర్మనీ, బెల్జియం, ఆస్ట్రియా మొదలయిన దేశాలలోని సోషలిస్టుపార్టీ నాయకులు బహిరంగంగా సామ్రాజ్యవాదప్రభుత్వాల పక్షం చేరి, యుద్ధ ఋణాలకు సమ్మతులనిచ్చి, ఒకరినొకరు చంపుగొనండని కూలీలని ప్రోత్సహించి యుద్ధం సాగించడానికి ఏర్పడిన కొయలిషన్ ప్రభుత్వాలలో చేరిపోయేరు. రష్యను, సెర్బియన్, పార్టీలు మాత్రమే ఇంటర్నేషనలు యొక్క కార్యక్రమాన్ని సంపూర్ణంగా అమలులోపెట్టేయి. "డ్యూమా" లోని బోల్షివికుప్రతినిధులు రష్యన్ప్రభుత్వం చేయదలచిన యుద్ధఋణాలకు వ్యతిరేకంగా వోటు చేసి, సైబీరియాకు ప్రవాసం పంపించబడ్డారు. 1914 డిసెంబరులో జర్మనీరీచ్‌లో "లీబ్నెచ్" (Liebknacht) యుద్ధ

ఋణాలకి వ్యతిరేకంగా వోటు చేసేడు. బోల్షివిక్కులు, జర్మనీలోని "లీబ్నెచ్", "రోజా లక్జెంబర్గు"ల పార్టీవారు "సోషలిస్టు ఇంటర్నేషనలు" యొక్క పునర్నిర్మాణం విషయంలో నాయకత్వం వహించేరు.

రెండవ "ఇంటర్నేషనలు" కూలిపోయిన ఈసమయంలో కష్ట నిష్ఠురాలన్నిటినీ ఎదుర్కొని సోషలిస్టులు నడవవలసిన మార్గం నిశ్చయించి నిర్ణయించడానికి మిగిలిన నాయకుడు ఒక్కలెనినే. యుద్ధారంభం నాటికి ఆస్ట్రియాలో వున్నాడు. ఆస్ట్రియను ప్రభుత్వం అతనిని అరెస్టు చేసి పదిహేనురోజులు పోయాక వదిలివేసింది. లెనిను వెంటనే అక్కడ నుంచి స్విట్జర్లాండుకు పోయేడు. 1917 లో రష్యాలో విప్లవం ఆరంభం అయ్యేవరకు ఆతడు అక్కడనే వుండి ఆందోళన సాగించేడు. 1914 సెప్టెంబరునాటికి తన కార్యవిధానం అంతనూ వివరిస్తూ "యూరపియన్ యుద్ధంలో సోషల్‌డెమాక్రటిక్‌పార్టీలోని విప్లవవాదకక్షియొక్క కర్తవ్యం" అంటూ ఒక ప్రణాళిక (Theses) తయారుచేసేడు. దానిలో ఆతని కార్యవిధానం అంతా స్పష్టంగా వ్రాయబడివుంది. ఈ ప్రణాళికను, రష్యాలోనున్న బోల్షివికులు-ప్రవాసంలోనున్న బోల్షివికులు అంతాకూడా అంగీకరించేరు. "రష్యన్‌సోషల్‌డెమాక్రటిక్‌పార్టీ" యొక్క కార్యనిర్వాహకవర్గం దానినితమ కార్యప్రణాళికగాఅంగీకరించింది. తరువాతదానిలో అవసరమైనకొద్దిమార్పులుచేసి (అక్టోబరులో) "లెనిన్" దానిని 1914లో నవంబరు 1వ తేదీనాటికి ప్రకటించేడు. 1914సెప్టెంబరులో ఇటలీ—స్విట్జర్లండుదేశాల సోషలిస్టులు "లూగానో" లో సమావేశం అయి, ఈప్రణాళికనే చర్చించి చాలవరకు అంగీకరించేరు. 1915 సెప్టెంబరులో దేశదేశాల సోషలిస్టులు "జిమ్మర్వాల్డు" లో సమావేశం అయ్యేరు. ఈ సమావేశానికి వచ్చిన అతివాదపక్షానికి "లెనిన్" నాయకత్వం వహించేడు. 1916 ఏప్రిలులో జరిగిన "కెంథాల్" సమావేశంనాటికి ఈ అతివాదకక్షి ఎక్కువ పలుకుబడి సంపాదించుకొనగలిగింది. ఈ "జిమ్మర్వాల్డు-అతివాదపక్షమే" కొనకి అంతర్జాతీయపక్షంగా స్థిరపడిపోయింది.

1919 లో స్థాపించబడిన మూడవ "ఇంటర్నేషనలు" తో ఈ "జిమ్మర్వాల్డు" రక్షీ కలిపివేయబడింది.

ఈ విధంగా 1914 అనంతరం "ఇంటర్నేషనల్ సోషలిజానికి" "లెనిన్" ప్రత్యక్షనాయకుడు అయ్యేడు. మొట్టమొదట ఎవ్వరో కొద్ది మంది సహాయకులతో మాత్రం ఆరంభం అయిన ఆతని నాయకత్వం కొద్ది సంవత్సరాలలోనే ప్రపంచం అంతటా లక్షలకొలది అనుచరుల్ని సంపాదించింది.

1914-18 లలోని యుద్ధంయొక్క సత్యపరిస్థితులను పరిశీలించి, "మార్క్సిస్టు" విధానం ప్రకారం "లెనిన్" తన మార్గం నిర్ణయించుకొని దానిని అనుసరించేడు. ఎన్నోవ్యాసాలు, ఉపన్యాసాలు, తీర్మానాలు, కరపత్రాలు ప్రచురించీ, ప్రధానదేశాలలోని ఉద్యమాలప్రతినిధులతో ప్రత్యక్షసంబంధాలు ఏర్పరచుకొనీ, ఆతడు ముఖ్యంగా మూడు విషయాల కోసం ఎడతెగకుండా తన పోరాటాన్ని సాగించేడు.

వానిలో మొదటిది. ఒకప్పుడు సోషలిస్టుపార్టీ సభ్యులుగా ఉంటూ వచ్చిన జాతీయనాయకులు ప్రజాసామాన్యాన్ని తమవైపునకు ఆకర్షించేటందుకై చెప్పుతూన్నట్లు ఈ ప్రపంచయుద్ధం "జాతీయరక్షణ" కోసం జరగడంలేదు. ఇది కేవలం సామ్రాజ్య వాదయుద్ధమే. అంటే—ధనికులయిన పెట్టుబడిదారుల చేతులలోవున్న సామ్రాజ్యవాద ప్రభుత్వాలు తమ యొక్క లాభాలకోసం; ప్రపంచాన్ని దోచుకొనేటందు కొఱకు; భూభాగాల్ని కలుపుకొనేటందుకై; తనఖాలకై; వలసరాజ్యాలకై; మాత్రమే ఈ యుద్ధాన్ని సాగిస్తున్నాయి. (ఈమధ్య నీమధ్య బయలుపడిన మిత్రమండలి రాజ్యాలు తమలో తాము వ్రాసికొన్న రహస్య సంధిపత్రాలు, జర్మనీపై అంటగట్టిన "బ్రెస్టు" సంధి, జయాన్ని సంపాదించినమిత్రమండలి ప్రభుత్వాలు తయారుచేసిన "వెర్సయిల్సు సంధి" ఇవన్నీ పై విషయాన్ని రుజువు చేస్తున్నాయి.) సామాజికదాస్యం, ఉన్నంతవరకూ యుద్ధాలు తప్పవని మార్క్సు చెప్పినట్లు "లెనిన్" రూఢీపరచేడు.

మార్క్సిజం విప్లవయుద్ధాల (పెట్టుబడిదారుల దాడినుంచి సోషలిస్టు ప్రభుత్వాన్ని రక్షించుకుందుకుచేసే యుద్ధాలు.) ఆవశ్యకతనీ, న్యాయ బద్ధతనీ, నిరూపించింది. అది జాతీయస్వాతంత్ర్యసంపాదనకై చేసే యుద్ధాలనుకూడ (సామ్రాజ్య వాదంతో భారతీయులు, చైనీయులుజరిపే యుద్ధాలమాదిరివి.) అంగీకరించింది. కాని ప్రస్తుతం జరుగుతూన్న సామ్రాజ్యవాదయుద్ధంలో యజమానులలాభాలకోసం కూలీలు ఒకరి నొకరు చంపుకోవలసిన అవసరం లేదు. సామ్రాజ్యవాదులపై తిరుగు బాటుచేయడానికై ఏకం కావడంలోనే ఉపయోగంవుంది.

రెండోది. సామ్రాజ్యవాదయుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చడం; పెట్టుబడిదారీవర్గాన్ని కూలద్రోసి సోషలిజాన్ని విజయవంతమునుగాచేసే టందుకై తమ దేశంలోని సామ్రాజ్యవాదులమీదనే తిరుగుబాట్లు లేవదీయ డం; ఇదే ప్రతిదేశంలోను గల కార్మికవర్గం చేయవలసిన పని. నేడు పెట్టుబడిదారీవిధానం ప్రారంభించిన సర్వసంహారకాండనుంచి తప్పించు కోవాలన్నా, ప్రపంచయుద్ధపరంపరల బారినుండి తొలగాలన్నా అంత కంటె వేరుమార్గం లేదు. ఈ పనికి ఫలితం కూడా అందరికితెలిసినదే. ప్రభుత్వం ఇతరదేశాలతో యుద్ధం తలపెట్టి యున్నపుడు విప్లవాందోళన చేయడం అంటే తనదేశంలోని ప్రభుత్వంయొక్క ఓటమికి సహాయం చేసినట్లే. ప్రత్యర్ధి సామ్రాజ్యవాదాన్ని నిరసించి, తన స్వదేశంలోని సామ్రాజ్యవాదానికి సహాయం చేయడం అంటే సామ్రాజ్యవాదానికి సాయం చేసినట్లే. త్రికరణశుద్ధిగా తీవ్రముగా జరపవలసిల ఈపోరాటం యొక్క పరీక్ష తనదేశంలోని సామ్రాజ్యవాద ప్రభుత్వంతో పోరాడి నప్పుడే తేలుతుంది. ఒకప్పుడు సోషలిస్టులుగావున్న ఆ ద్రోహులు కాదంటేనేమిటి? మార్క్సు చెప్పినట్లు కార్మికులకి మాతృదేశం అనేది లేనేలేదు. కూలీలు తమదేశాధికారాన్ని హస్తగతం చేసుకోగలిగినప్పుడే "జాతీయరక్షణ" చేసుకోవలసిన స్థితి ఏర్పడుతుంది.

మూడోది. రెండవ "ఇంటర్నేషనలు" కూలిపోయిన కారణం యుద్ధంవలన వివిధదేశాల సోషలిస్టుపార్టీలకిగల ఆంతరికసంబంధాల

ఎడబాటువలన కాదు. యుద్ధానంతరం వీరంతా తిరిగి కలియడానికి అవకాశమూ లేదు. ఎవ్వరో కొద్దిమంది నాయకులు చేసిన ద్రోహంవలన ఇది తటస్థపడినదీ కాదు. పూర్వకాలపు సోషలిస్టుపార్టీలలోను, వారి నాయకులలోను పాదుకుపోయిన ఒదుగుబాటుదనం ఒక్కమారుగా బయలు పడిపోయింది. ఇప్పుడు కొత్తగా ఒదుగుబాటుదనంయొక్క స్పర్శ ఏమాత్రమూలేని కార్మికవర్గం సహాయంతో మళ్లీ అంతర్జాతీయ పక్షం స్థాపించబడాలి. "రెండవ ఇంటర్నేషనలు కూలిపోయింది;మూడవ ఇంటర్నేషనలు చిరస్థాయి అగుగాక!"

సామ్రాజ్యవాదయుద్ధసమయంలో "లెనిన్" నాయకత్వం ఇచ్చే హెచ్చరిక ఏమిటి? "సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చండి." ఈ హెచ్చరిక అన్నిదేశాల వారిచేతనూ తిరస్కరింపబడి నిందించబడింది. ఈనిందించినవారు ఒక ప్రతిస్పర్థులేకాదు. "జిమ్మెర్వాల్డు" లో పాల్గొన్న సోషలిస్టు పార్టీనాయకులలో పెక్కుమంది ఈ హెచ్చరికలు "యథార్థపరిస్థితులతో అనుభవం లేని ప్రవాసియొక్క పిచ్చి ప్రలాపా" లని నిందించేరు. 1917 మార్చిలో రష్యావిప్లవం వచ్చినపుడు చరిత్రే నిజాన్ని బయటపెట్టింది.

## రష్యా విప్లవంయొక్క విజయం.

ప్రారంభంనుంచీ రష్యావిప్లవం ప్రజాసామాన్యంలోనుంచేబయలు దేరింది. "పీటర్సుబర్గు" కూలీలు సమ్మె చేస్తే, "యుద్ధం ఆగిపోవాలి"— "జారుప్రభుత్వం కూలిపోవాలి—" "తిండి కావాలి." అని కేకలు పెడుతూ వీధినపడడంతో ఆవిప్లవం ఆరంభం అయింది. సమ్మెలు-ప్రభుత్వ వ్యతిరేకప్రదర్శనాలు క్రమంగా విజృంభించి మార్చినెలలో మొదటిరోజులనాటికి పరాకాష్ఠను అందుకున్నాయి. లక్షలకొలది కూలీలు వీధులలోనికి వచ్చివేసేరు, సమ్మెదారుల్ని కొట్టడానికి కోసక్కులు నిరాకరించేరు. కూలీలను కాల్చడానికి పంపబడిన కోసక్కు సిపాయీలు

వందలకొలదిమంది కూలీలతో పోయి చేరుకున్నారు. జారుప్రభుత్వం వంపిన ప్రత్యేక పోలీసుదళాన్ని కాల్చిచంపడంలో ఈసైనికులు కార్మికులకి ఎప్పుడు చేయూత ఇచ్చేరో అప్పుడే విప్లవం జయం పొందితీరుతుందని దృఢపడిపోయింది. ఇంక జారిస్టుప్రభుత్వం సింహాసనత్యాగం చేయక తప్పిందికాదు.

రష్యాప్రభుత్వం యుద్ధంకారణంగాఆర్థికంగాను, రాజకీయంగాను, కూడా శిథిలము అయిపోయింది. విధ్వంసం అయిపోయింది. ఉన్నత వర్గాల ప్రజలలో అవినీతి-దౌర్మార్గ్యం ప్రబలిపోయింది. యుద్ధరంగాలన్నిటిలోనూకూడా రష్యనుసైనికులు వేలకొలదిమంది జర్మనుఫిరంగుల దాడులకి నుగ్గునూచయిపోతున్నారు. రైతులు నాశనంఅయ్యేరు. పట్టణ ప్రజలకి తిండికూడా లేకుండాపోయింది. ఈవిధంగా అన్నిమూలలనుంచీ ఒక్కమారు ఒత్తిడికలగగానే ఎంతోకాలంనుంచి కూలిపోకుండా అతికష్టంమీద నిలవపెట్టబడుతూవచ్చిన జారుప్రభుత్వం ఈ దెబ్బతోపూర్తిగా కూలిపోయింది.

మార్చివిప్లవాన్నిసాధించినది కేవలం కూలీలు,సైనికులుమాత్రమే. ఇతరులకి అందులో స్థానంలేదు. ఆనెలలో ప్రభుత్వాధికారం అంతాకూలీల చేతులలోనేవుంది. అయితేనేం — వారికి దానిని ఉపయోగించుకొనేపద్ధతి తెలియదు. వారిగమ్యం ఏమిటోకూడా వారికి ఆనాటికి స్పష్టంగా తెలియదు. ప్రజావిప్లవాదర్శాలు మార్చి విప్లవంనాటికి కేవలం బీజరూపంలోనే వున్నాయి. ఆ బీజాలు నవంబరునెలనాటికి మొలకలెత్తి బాగా బలపడ్డాయి. శాంతి-ఆహారం-భూమి-నూతనసమాజవిధానం-ఇవే మార్చి నెలలో వారు కోరిన కోరికలు. కాని ఆనాటికి స్వల్పసంఖ్యాకులుగా మాత్రమేయున్న వారి నాయకులయిన బోల్షివికుపార్టీకితప్ప ప్రజాసామాన్యానికి ఏవిధమైన రాజకీయపరిజ్ఞానమూ లేదు. తమ ఆదర్శాలను సాధించగల మార్గాలను గుర్తించగల చైతన్యము అసలే లేదు. ఆ ఆదర్శాలను గుర్తింపచేసేటందుకై మార్చిమొదలు నవంబరు వరకుగల ఎనిమిది నెలల కాలంలోను తీవ్రమైన రాజకీయప్రచారం చేయవలసివచ్చింది.

1917 మార్చి విప్లవంమొదలు నవంబరు విప్లవంవరకుగల ఎని
ు నెలలలోను వర్గకలహం అతివేగంగా ప్రజ్వరిల్లింది. ఆ రోజుకా
జా వర్గాలయొక్క, వారిప్రతినిధులయొక్క మార్గాలు విస్పష్టం అయి
యి. ప్రజలలో విపరీతమైన రాజకీయాభివృద్ధి, చైతన్యము కలిగింది.
ంతో ఆఖరుకి కూలీలు రైతులసహాయంతో రాజ్యాధికారాన్ని స్వాధీ
చేసుకొని తమకు లాభకరమయిన ప్రభుత్వవిధానాన్ని ఏర్పాటుచేసు
ోగలిగేరు. ప్రజోద్యమాభివృద్ధిక్రమంలో కార్మికవర్గంయొక్క ఏకైక
జకీయపక్షం అయిన బోల్షివిక్‌పార్టీ చాలా ప్రాధాన్యం వహించింది.
ుదట ఈ పార్టీకి ఎంతో బలంలేదు. కాని ప్రజలు అభివృద్ధి పొందిన
ంది దీనికికూడా సంఖ్యాబలం చేరింది. బలం అధికంఅయినకొలదీ
జోద్యమాన్ని ముందుముందుకు తీసుకొనిపోయి రాజ్యాధికారాన్ని
్వధీనం చేసుకొనే ప్రయత్నాలలో విజయంపొంది, నూతనప్రభుత్వాన్ని
పించగలిగింది. ఈ ఉద్యమాన్ని నడిపించిన బోల్షివికుపార్టీనాయకు
ులో "లెనిన్" అగ్రగణ్యుడు.

కార్మిక-సైనిక-ప్రతినిధులతో కూడిన సోవియట్లలోని ప్రజాసామా
ుం రాజకీయానుభవం తక్కువ కావడంచేత ప్రప్రథమంలో మెన్షి
కులమీద, సోషల్‌రివొల్యూషనరీలమీద విశ్వాసం ఉంచేరు. ఆ నాటికి
ల్షివికుల సంఖ్య చాలా అల్పం అని పైన చెప్పేము. వర్గచైతన్యం
ు కొద్దిమంది కార్మికులుమాత్రం ఆ పక్షంలో వుండేవారు. మెన్షివికులు
ోషల్‌రివొల్యూషనరీలు బూర్జువావర్గాన్ని పట్టుకొని ప్రాకులాడేవారు.
ను బూర్జువారాజకీయవేత్తల్ని రాజ్యాంగవిధానం ఏర్పాటు చేయమని
ాధేయపడ్డారు. ఆవిధంగా విప్లవంలో ఏమాత్రమూ కలుగచేసుకొని
ండని బూర్జువావర్గం తాత్కాలికంగా విప్లవప్రభుత్వాన్ని స్థాపించ గలి
రు. "ప్రిన్సువోవ్" (Lvov) కాడెట్ (కాన్స్టిట్యూషనల్ డెమాక్రటిక్
ార్టీ) నాయకుడు మ్యులికోవులు దానికి నాయకత్వం వహించేరు. ఈ
ుంత్రివర్గంలోనున్న లేబరుపార్టీవాడు ఒక్క కెరన్స్కీయే. ప్రజలందరికీ

ఇష్టుడని చెప్పబడే ఈతడు సోషల్‌రివొల్యూషనరీలలో మరీ మితవ కక్షికి చేరినవాడు. ఈవిధంగా ఒకవైపున బూర్జువావర్గం ఏర్పర తాత్కాలికప్రభుత్వము, మరియొకవైపున సోవియట్లు ఏర్పడి, ద ప్రభుత్వం నడవసాగింది.

ఈ దంద్వప్రభుత్వంకూడా ఎంతోకాలం సాగదని ఏదో ఒ వర్గమే అధికారంలో వుండగలదని పైవిధంగా త్వరలోనే తేలిపోయిం ద్వంద్వప్రభుత్వం సాగిన ఎనిమిది నెలలలోనూ, ఉభయపక్షాలూ ఒక వరసన పోరాటాలు సాగించేయి. వీటివలన ఆఖరుకి తేలింది ఏమిట కూలీలు-రైతులు కలిసి ప్రభుత్వాధికారాన్ని స్వాధీనం చేసుకొని బోల్షి కులు చెప్పినట్లుగా సోవియట్లనైనా స్థాపించాలి. లేదా, జనరల్ కార్ని లోవు, కెరన్స్కీలు, నడుపుతూన్న ప్రతివిప్లవానికి పూర్తిగాలొంగియైన పోవాలి. అంతే! మరి మూడోదారి లేనేలేదు. ఈరెండువర్గాలలో దేని చేరలేక ఊగులాడిన మధ్యతరగతుల ప్రతినిధులకీ మెన్షివికు-సోష రివొల్యూషనరీ నాయకులకీ అంతకంతకు ప్రజలలో పలుకుబడి సన్న గిలింది.

ఏప్రియలు 16 వ తేదీన "లెనిన్" స్విట్జర్లాండునుండి పీటర్సు బర్గుకు వచ్చివేసేడు. విప్లవవాదులయిన సోషలిస్టుప్రవాసితుల్ని రష్యాకు తిరిగిపోనీయడానికి మిత్రమండలిప్రభుత్వాలు అంగీకరించలేదు. అందు చేత లెనిన్ సామ్రాజ్యవాదప్రభుత్వాలమధ్యగల పరస్పరవైరుధ్యాలనుఉప యోగించుకొని అంతర్జాతీయప్రఖ్యాతిగల సోషలిస్టునాయకుల సిఫార్సు ఉత్తరాలుచూపి, జర్మనీగుండా రహస్యంగా స్నేహితులతోకూడా రష్యాకు చేరుకున్నాడు. లెనిన్‌యొక్క రాజకీయప్రతికక్షులంతా ఆఖరికి కెరన్స్కీ ప్రభుత్వంకూడా బోల్షివికులను జర్మనుఏజంట్లని ప్రచారం చేయడం కోసం ఈఘటనను ఉపయోగించుకున్నారు. బోల్షివికుల్ని అప్రతిష్ఠపాలు చేయడానికై చేసే ప్రచారంలో బూర్జువాలు ఎలాగంటిచాతుర్యమూ, తెలివీ ఉపయోగిస్తారో మనం ఈవిషయం ఒక్కదానివలనా తెలుసుకోవచ్చును.

"లెనిన్" మొదటినుంచీ-అంటే స్విట్జర్లండు విడువకపూర్వం నుంచీ విప్లవంలో పాల్గొంటూన్నవర్గాల పరస్పర సంబంధాలనుగూర్చి ఒకస్పష్టమైన అభిప్రాయానికివచ్చి ముందు పోవలసినదారి ఏర్పాటుచేసుకున్నాడు. విప్లవాన్నిగూర్చి తెలియపరుస్తూ చెదురుచెదురుగా వచ్చిన కొద్దిపాటి టెలిగ్రాములను చూచినవెంటనే మార్చి 16 వ తేదీన ఒక జాబులో—

"కార్మికప్రతినిధులతో కూడిన సోవియట్లు వెంటనే ప్రభుత్వాధికారాన్ని స్వాధీనం చేసుకోవడమే నేడు అత్యావసరంగా చేయవలసిన పని." అని వ్రాసేడు. మార్చి 17 వ వ్రాసిన తన మొదటిప్రకటనయొక్క చిత్తుప్రతిలో ఈలాగ వ్రాసేడు.

"విపరీతమైన సంఖ్యాబలంగల రైతులు, పేదరైతులు, వ్యవసాయపుకూలీల సహాయంతో ఏర్పడిన కార్మికప్రభుత్వం ఒక్కటే యుద్ధాలలో మునిగియున్న ఇతర దేశాల కూలీలతో మంచిమాట చేసుకొని తన ప్రజలకి శాంతి-ఆహారం-స్వాతంత్ర్యం ఈయగలదు."

ఏప్రియల్ 8 వ తేదీన "విదేశాలనుంచి వ్రాసిన లేఖలలో" అతడు ఆ కర్తవ్యాన్ని ఈవిధంగా వివరించేడు.

"(1) విప్లవములోని తరువాతి దశకు-లేదా, రెండవిప్లవానికి-దారి తీయగల సరియైన విధానాన్ని తెలుసుకోవాలి. (2) ఆరెండవ విప్లవం రాజ్యాంగాధికారాన్ని భూస్వాముల-పెట్టుబడిదారుల చేతులనుంచి (గుచికోవ్-ల్వోవ్-మిలికోవ్-కెరన్స్కీల ప్రభుత్వం) తప్పించి . కార్మికుల-పేదరైతులస్వాధీనం చేయబడాలి. (3) కార్మిక-కర్షక ప్రతినిధులతో కూడిన సోవియట్ల పద్ధతిలోనే ప్రభుత్వం నిర్మింపబడాలి."

అటువంటి ప్రభుత్వమే శాంతికోసం చేసే పోరాటంద్వారా భూస్వాములనుంచి భూమిని, పరిశ్రమలను, స్వాధీనం చేసుకోగలదు. ఈ మార్గాలన్నీ—

"సోషలిజంలోకి పరిణతి చెందడాన్ని సూచిస్తాయి. మధ్యఅంతరువులులేనిదే రష్యాలో సోషలిజాన్ని వెంటనే సరాసరిగా స్థాపించడం అసంభవం. మధ్య మధ్య అంతరువులు ఏర్పరచడానికి తగిన పరిస్థితులు కల్పిస్తే సోషలిజాన్ని స్థాపించడం సులభసాధ్యమే కాదు, తప్పకుండా వచ్చి తీరుతుంది."

మొదటి విప్లవం విజయం పొందిన అయిదు వారాలకి "లెనిన్" రష్యాలో అడుగుపెట్టేడు. ఆనాటికే సోవియట్లలో అధికభాగం పెట్టీ-బూర్జువాలచేత, మెన్షివికులచేత, సోషల్‌రివొల్యూషనరీ నాయకులచేత ఆక్రమించివేయబడినాయి. వీరంతా బూర్జువాప్రభుత్వం వెనకాల వ్రేలబడి వారిదయకోసం ప్రాకులాడుతూన్నారు.

పరిస్థితులు ఈలాగవుండగా లెనిన్ దేశంలో అడుగు పెట్టేడు. వస్తూనే "ప్రస్తుతవిప్లవంలో కార్మికుల కర్తవ్యాలను" గూర్చి ఏప్రియలు ప్రణాళిక (Theses) ను ప్రకటించి తీవ్రంగా దానిని ప్రచారం చేయసాగేడు. ఆథీసిసు నవంబరువిప్లవానికి మార్గం సరిచేసింది. దానిలో వివరించిన పదివిషయాలను ఇక్కడ క్లుప్తంగా వ్రాస్తున్నాను.

(1) పెట్టుబడిదారీవర్గం ప్రభుత్వంలో ఉండగా "విప్లవకరమగు ఆత్మరక్షణకు" ఏమీ సహాయం చేయకూడదు. కార్మికులు, బీదరైతులు అధికారాన్ని స్వాధీనం చేసుకొన్నాక, ఆక్రమణలన్నీ వదులుకొన్న వెనుక, పెట్టుబడిదారుల ప్రయోజనాలతో సంబంధం పూర్తిగా వదులుకొన్నాక, మాత్రమే విప్లవయుద్ధానికి అంగీకారం చూపాలి.

(2) విప్లవంయొక్క రెండవదశకి—కార్మికులు — బీదరైతులు కలిసి రాజ్యాధికారం వశం చేసుకొనడం అనే దశకి-విప్లవంయొక్క ప్రస్తుతావస్థను ఒక మెట్టునుగా మాత్రమే గుర్తించాలి.

(3) తాత్కాలికప్రభుత్వానికి ఏవిధమైన సహాయం చేయకూడదు.

(4) ప్రస్తుతం సోవియట్లలో అల్పసంఖ్యాకులుగామాత్రం ఉన్న బోల్షివిక్కు-రాజ్యాంగాధికారాన్ని ఒదుగుబాటుదారులుగా(Opportunist) వుండే పెట్టీ-బూర్జువానాయకుల పలుకుబడినుంచి తప్పించి తమ చేతులలోనికి తీసుకోవలసియుందనే చైతన్యం ప్రజలలో అత్యధికసంఖ్యాకులలో కలిగేవరకూ-"ఓరిమితో-పట్టుదలతో-నిర్ణీతమార్గంలో" ప్రచారం సాగించాలి.

(5) మనకు కావలసినది పార్లమెంటరీవిధానం కాదు. కార్మిక-

(6) భూమిఅంతా జాతిపరం చేయబడాలి. దానిమీద రైతుల సోవియట్లు అధికారం వహించాలి. బీదరైతుల్నీ-వ్యవసాయపు కూలీలనూ, ప్రత్యేకసంఘాలుగా ఏర్పాటు చేయాలి.

(7) బ్యాంకులన్నీ జాతీయాధికారంలోకి తీసుకొని, ఒకేఒక సెంట్రల్‌బ్యాంకును ఏర్పరచాలి. దానిమీద కార్మికసోవియట్లు అధికారం వహించాలి.

(8) సోషలిజాన్ని వెంటనే ప్రవేశపెట్టడం ప్రస్తుతకర్తవ్యం కాదు. వస్తూత్పత్తినీ-పంపకాన్నీ సమాజపరంచేసి, వానిని కార్మికప్రతినిధులతోకూడిన సోవియట్లకి వెంటనే స్వాధీనం చేయాలి.

(9) పార్టీ కాంగ్రెసును వెంటనే సమావేశపరచి ముందు కార్యక్రమాన్ని పునరాలోచనకు పెట్టాలి.

(10) విప్లవతత్త్వంగల "ఇంటర్నేషనలు"ను తిరిగి కొత్తదానినిస్థాపించాలి.

నవంబరువిప్లవంలో సాధించబడిన కార్యాలతోను, సోవియటు ప్రభుత్వంయొక్క అనంతర కార్యానుసరణితోను, పైకార్యప్రణాళికకు గల సన్నిహితసంబంధాన్ని తెలుసుకోవాలంటే ఈ ఏప్రియలు థీసిసు యొక్క-మూలాన్నే పరిశీలించడం అవసరం. ఏదో కొద్దిమందిమాత్రమే రాజ్యాధికారాన్ని స్వాధీనం చేసుకొనేటందుకు ప్రయత్నిస్తున్నారని; విప్లవంపూర్తి అయ్యేదాకా వూరుకొని ఆఖరున ప్రజాప్రతినిధిపరిషత్తునూ, పార్లమెంటరీవిధానాన్ని స్వార్థపరత్వంతోనో—ప్రజాతంత్రప్రతికూలురు అవడంచేతనో—త్రోసిపుచ్చేరనీ; సోషలిజాన్ని వెంటనే అమలు పెట్టదలచేరనీ; నవంబరువిప్లవానికి ఆరోపించబడిన అపవాదులన్నిటినీ ఈ ఏప్రియల్ థీసిసు వట్టిఅబద్ధం అని చాటుతూంది. ఈ విషయం గమనించికూడా ఇంకా అలాగే వాదించేవారిని ప్రపంచవిషయపరిజ్ఞానం లేని మూర్ఖులనియేనా చెప్పాలి. లేదా కృత్రిమంగా ఏమీ తెలియనట్లు నటిస్తు

మార్చి విప్లవం తర్వాత దేశపరిస్థితులన్నీ చాలా గందరగోళంగా వున్నప్పుడు ఈఏప్రియలు థీసిసు అంధకారంలో దివ్వెలా గంతవ్య పథం చూపించింది. ఈ కార్యప్రణాళికకి బదులు సోషలిస్టులలోని ఒదుగు పాటుదారులగువారి (Opportunist) మార్గమే అవలంబించబడియుంటే జర్మనీలో జరిగినట్లే రష్యాలోకూడా విప్లవం ఒక మహాఅగాధంలోపడి అంతరించిపోయేదే. ఈ థీసిసులో విప్లవంలో అవలంబెంచవలసిన కార్యానుక్రమణిక విస్పష్టంగా వివరించబడింది. అందులో ప్రకటించ బడిన లెనిన్ అభిప్రాయాలను అతని రాజకీయ శత్రువులయిన అన్ని పార్టీలవారు “అరాజకుని పిచ్చిపేలాపన” అని ఖండించేరు. ప్రారంభం రోజుల్లో సోషల్‌డెమాక్రటిక్‌పార్టీని స్థాపించి, తరువాత తరువాత అప భ్రంశపు దేశభక్తి ప్రదర్శించిన “ప్లెఖనోవ్” కూడా “లెనినుకు సంధిం చింది” అని వేళాకోళం చేసేడు.

కాని, దానిలో స్పష్టపరచబడిన ప్రజావసరాల ఆవశ్యకతను గుర్తించి ప్రజలు త్వరలోనే దానికి విపరీతంగా తోడ్పడ్డారు. ఇది ప్రక టించబడిన మూడువారాలలోపుగా మే నెల 5—12 తేదీలలో జరిగిన బోల్షివిక్‌పార్టీ కాంగ్రెసులో “లెనిన్” వేసిన కార్యప్రణాళిక ఏకగ్రీవంగా అంగీకరించబడింది. తరువాత కొద్ది నెలలలోనే ఈకార్యక్రమం దేశం లోని అత్యధికసంఖ్యాకులయిన కార్మిక-కర్షకు లందరిచేతా అంగీకరించ బడింది.

ద్వంద్వప్రభుత్వాలలో తప్పనిసరిగా వచ్చే వైరుధ్యాలు; నిశితము లయిన సమస్యలు; ప్రజోద్యమంయొక్క అభివృద్ధికే సహాయపడినాయి. విదేశాంగమంత్రియైన మ్యులికోవు మే నెలలో సామ్రాజ్యవాదయుద్ధాన్ని సాగించితీరుతామని ప్రకటించడానికి ప్రయత్నించేడు. వెంటనే ప్రజలు పెద్దపెద్ద వ్యతిరేక ప్రదర్శనాలను ఆరంభించేరు. తత్ఫలితంగా మ్యులి కోవ్—గుచికోవులు రాజీనామాల నిచ్చేరు. కొయలిషన్ మంత్రివర్గం ఏర్పడింది. దీనిలో మితవాదులయిన సోషలిస్టులు బహిరంగంగా పాల్గొ

న్నారు. కెరన్స్కి—యుద్ధశాఖామంత్రి యైనాడు. బూర్జువావర్గానికి అందులోనూ బ్రిటిషు—ఫ్రెంచి పెట్టుబడిదారులకి లొంగుబాటు ప్రదర్శించడం వలన ఈసోషలిస్టు మితవాదుల విప్లవ వ్యతిరేకత పూర్తిగా బయట పడిపోయి ప్రజాసామాన్యంయొక్క ఆదరణానికి దూరం అయిపోయేరు. బూర్జువాల ఒత్తిడివలన మంత్రివర్గం తమశాంతిసందేశాలను ఒకవేపుకి నెట్టి, నిరర్థకము, రక్తప్లావితము నగు జూలై దాడికి తప్పనిసరిగా అంగీకరింపవలసి వచ్చింది. ఈజూలై దాడివలన ప్రజల కోపం పెచ్చు పెరిగింది. ప్రభుత్వంమీద అసంతృప్తి హెచ్చింది. తత్ఫలితంగా పీటర్సు బర్గులో ప్రజలు సాయుధులయి ఊరేగింపు లారంభించేరు. దానితో కూలీలు—నావికులు—సైనికులు, ప్రభుత్వాధికారాన్ని స్వాధీనం చేసుకుందుకు సిద్ధంగా వున్నట్లు స్పష్టపడింది. కాని విప్లవం ప్రారంభించడానికి ఇంకా సమయం కాలేదనీ, తొందరపడి ఆరంభిస్తే పీటర్సుబర్గు రష్యాలోని ఇతర భాగాలనుంచి వేరయిపోతుందనీ, బోల్షివిక్కులు గ్రహించి ప్రజల్ని వెంటనే తిరుగుబాటు చేయకుండా నిలువరించేరు.

జూలై నెల ఆఖరుకి ప్రభుత్వశక్తులయిన పోలీసులు, పత్రికలు, ఇతర ప్రచారసాధనాలు బోల్షివిక్కులమీదికి గురిచేయబడినాయి. ఎందరెందరో బోల్షివికులు జైళ్ళలోత్రోసివేయబడ్డారు. "లెనిన్" మీద "జర్మనుల ఏజంటు" అనే గొప్పనింద మోపబడింది. ఆ నిందను ఋజువని ప్రచారం చేయడానికి ఎన్నో అబద్ధపుపత్రాలు సృష్టించబడి ప్రకటించబడినాయి. వెంటనే "లెనిన్" తెరచాటుకుపోయి రహస్యంగా విప్లవ నాయకత్వాన్ని నిర్వహించవలసివచ్చింది. లేకుంటే "లీబ్నెచ్" గతే అతడికికూడా తటస్థించి వుండేది. లెనినును చంపడానికి ప్రభుత్వోద్యోగులు ఎన్నో గూడు పుఠాణీలు సాగించేరు. ఆఖరుకు ఈవిధంగా సోషలిస్టుమంత్రులు ప్రతివిప్లవప్రవాహం లోనికి కొట్టుకుపోయేరు. సెప్టెంబరు నెలలో విప్లవాన్ని అణచివేయడానికై మంత్రులు పీటర్సుబర్గుపైకి "సేవేజ్ డివిజను" ను జనరల్ కార్నిలోవ్ స్వాధీనంచేసి పంపించేరు. కెరన్స్కీ—కార్నిలోవును సర్వసేనాధిపతినిగా నియమించేడు.

కార్నిలోవు దండయాత్రతో సోవియట్లశక్తులన్నీ కార్యరంగం లోకి ఉరికేయి. బోల్షివికులు, వారిని అనుసరించి సాయుధులైన కూలీలు, నావికులు, సైనికులు, విప్లవరక్షణకై యుద్ధరంగంలోకి ఉరికేరు. కార్ని లోవ్ దాడి, ప్రభుత్వ ప్రతిష్ఠతోపాటు శిథిలమైపోయింది. దానికి ఫలి తంగా బోల్షివిక్కుల ప్రతిభ పెచ్చుపెరిగింది. వారే సరియైన నాయకు లనీ. విప్లవాన్ని సక్రమంగా నడిపించగలరనీ, ప్రజలకి వారిపైవిశ్వాసం కలిగింది. కెరన్స్కీ అతనిచే నడిపించబడుతూన్న తాత్కాలిక ప్రభు త్వము, అప్రతిష్ఠల పాలయ్యేరు. కార్నిలోవు దాడితో తమకి సంబంధం లేనట్లు నటించినా వారికి సంపూర్ణంగా సంబంధం ఉన్నట్లు బయటపడి పోయింది. అందుచేత సోవియటుప్రభుత్వాన్ని స్థాపించి విప్లవాన్ని కొన కంటా సాగించడమో లేక దారుణమైన ప్రతివిప్లవానికి లొంగిపోవడమో తప్ప వేరు గత్యంతరం లేదని అందరికి తెలిసిపోయింది.

ఈసంఘటనలు, ఈపరిణామాలు, బోల్షివిక్కులకి బ్రహ్మాండ మైన ప్రజాసహాయాన్ని సంపాదించిపెట్టేయి. పీటర్సుబర్గులో, మాస్కోలో, ఇతరప్రధాననగరాలలో, ట్రేడ్‌యూనియన్లలో, ఉత్తరరాష్ట్రపు సేనలలో, బాల్టికు నౌకాదళంలో వారి పలుకుబడి పూర్తిగా స్థాపించబడింది. సెప్టెం బరు ప్రారంభం నాటికే మాస్కో—పీటర్సుబర్గు సోవియట్లలో బోల్షివిక్కు లకి మెజార్టీ ఏర్పడింది. సెప్టెంబరు నెలలో కెరన్స్కీచేత పిలువబడిన ప్రజాప్రతినిధిసభలో కొయలిషన్ మంత్రివర్గాన్ని ప్రతిఘటించేటందుకు బోల్షివికులు వేసిన పథకాన్ని, సమర్థిస్తూ ట్రేడ్‌యూనియనుల ప్రతినిధులు, సోవియట్ల ప్రతినిధులు, జాతీయసంఘాల ప్రతినిధులు, ఓటు చేసేరు. జూలై నెలలో మాస్కో మ్యునిసిపలు ఎన్నికలలో మెన్షివికులకి నూటికీ 70 ఓట్లు వచ్చేయి. కాని సెప్టెంబరు ఎన్నికలలో వారికి వచ్చినవి నూటికి 18 మాత్రమే. బోల్షివిక్కులకి 51 ఓట్లు వచ్చేయి. మితవాదుల కేంద్ర కార్య నిర్వాహకవర్గం యాజమాన్యాన అక్టోబరులో సోవియటు కాంగ్రెసు ప్రతినిధుల ఎన్నికలు రష్యా అంతటా జరుపబడ్డాయి. ఈ

కాంగ్రెసు నవంబరు 7 వ తేదీన సమావేశం అయింది. దీనికి 390 మంది బోల్షివిక్కులు, వారితో సహకారానికి అంగీకరించే సోషల్ రివొల్యూషనరీలలో అతివాద కక్షికి చెందినవారు 179 మంది, అంతర్జాతీయతని సమర్ధించే మెన్షివికులు 35 గురు, 51 మంది మాత్రం మితవాదులైన మెన్షివిక్కులు వచ్చేరు. రష్యా అంతటా అందులోనూ ముఖ్యంగా పెద్దపెద్దనగరాలలో అక్టోబరునాటికే—కాదు, కాదు. సెప్టెంబరునాటికే—ప్రజాసామాన్యం అధికాధికంగా బోల్షివిక్కుల పక్షానికి మొగ్గేరు. నవంబరు 7 వ తేదీన జరిగిన బోల్షివిక విప్లవానికి ఇంత బలం వుంది వెనకాల. ఆవిప్లవం విజయం పొందడానికికూడా ఇదే కారణం.

సెప్టెంబరునుంచే "లెనిన్" సాయుధవిప్లవం ఆరంభించడానికి సమయం ఆసన్నం అయిందని తొందరచేయసాగేడు. అక్టోబరునెలలో అతడు "విప్లవరంగంయొక్క విజృంభణ అణిగిపోగలదనీ, ప్రజలలో నిరాశ ఏర్పడడానికి అవకాశం కలిగించినవారం అవుతామనీ, దానితో ప్రతివిప్లవంయొక్క విజయానికి సహాయము చేసినవారలము అవుతామనీ, తొందరగా విప్లవానికి తయ్యారు చేసుకోవాలనీ, తరుచుతరుచుగా హెచ్చరించసాగేడు.

"మన పార్టీలోని పూచీగల నాయకుల్ని నేడు బ్రహ్మాండం అయినకర్తవ్యం ఒకటి ఎదుర్కొంటూంది. దానిని నెరవేర్చడంలో వారు ఏమాత్రం ప్రొల్మాలినా అంతర్జాతీయకార్మికోద్యమానికి గొప్ప ఆపదను తెచ్చిపెట్టినవారు అవుతారు. పరిస్థితులు అలా వున్నాయి. అలస్యా దమృతం విషం."

(ఉత్తరరాష్ట్ర సోవియటు కాంగ్రెసులోని బోల్షివిక్కులకి 1917 అక్టోబరు 21 వ తేదీన వ్రాసిన జాబునుంచి.)

ఈరోజులలో "లెనిన్" వ్రాసిన అన్నిలేఖలలోను, పంపిన ప్రతి సందేశంలోను, "ఆలస్యం విషప్రాయం ఔతుంది" అనే హెచ్చరిక ప్రతిధ్వనిస్తూనేవుంది.

"నేడు పరిస్థితులన్నీ తలవెంట్రుకవాసిలోనికి వచ్చినాయని నామిత్రులందరికీ నాశక్తి కొలదీ తెలియపరుస్తున్నాను. కాన్ఫరెన్సులుగాని, కాంగ్రెసులుగాని, ఆఖరుకి

సోవియటు కాంగ్రెసుకాని ఈసమస్యల్ని పరిష్కరించలేవు. ఒక్క ప్రజలే-ప్రజ సమూహాలే సాయుధవిప్లవంద్వారా వానిని సాధించగలరు."

(సెంట్రల్‌కమిటీకి 1917 నవంబరు 6 వ తేదీన వ్రాసిన జాబు నుండి.)

అక్టోబరు 23 వ తేదీన బోల్షివిక్‌పార్టీయొక్క సెంట్రల్‌కమిటీ సాయుధవిప్లవానికి అనుకూలంగా తీర్మానించింది. ఈతీర్మానానికి వ్యతిరేకులు ఇద్దరు మాత్రమే. దానిప్రకారం నవంబరు 6 వ తేదీ రాత్రిభాగాన 7 వ తేదీ ఉదయాన రష్యనురాజ్యాధికారం ఏవిధమైన ఒడుదుడుకులు లేకుండా స్వాధీనం చేసుకోబడింది, ప్రతిఘటించగల శక్తి తాత్కాలిక ప్రభుత్వానికి ఏకోశానా లేకపోయింది. మార్చివిప్లవంలా కాకుండా నవంబరునెలలోని బోల్షివికువిప్లవం ఏమాత్రపు రక్తపాతమూలేకుండానే సాధించబడింది. చరిత్రలోని విప్లవాలన్నిటిలోనికీ రక్తపాతం ఏమాత్రమూ లేకుండా సాగించబడిన విప్లవం ఇది ఒక్కటే. రెండవ అఖిలరష్యా సోవియటుకాంగ్రెసు అధికారసూత్రాలు చేత పుచ్చుకొని "లెనిను"నుఆతనిసహాయకులను కార్మికప్రజాసామాన్యప్రభుత్వంయొక్క ఆజ్ఞానిర్వాహకులయిన "కమిస్సారు" లనుగా (Council of people's commisaries) నియమించింది. ఈవిధంగా కార్మిక-కర్షకనియంతృత్వం స్థాపించబడింది.

ఈ అంతిమపరిణామం ఏవిధమైన ప్రతిఘటనకూడా లేకుండా అంతవేగంగా అంతచులకనగా, ఎలాగ వచ్చిందో తెలుసుకోవాలి అంటే బోల్షివికువిప్లవానికి వెనుకఅండగా నిలచిన ప్రజాబలాన్ని గుర్తించాలి. ఎంతోకాలం నడిచిన పోరాటంయొక్క ఆఖరుదశయే ఈఅంతిమ పరిణామం. ప్రపంచంలోని డెమాక్రటిక్‌విప్లవాలలోకెల్ల ప్రజాతంత్రపద్ధతులపై నడిపించబడినది ఈబోల్షివికువిప్లవం ఒక్కటే. (ఇది ప్రజాతంత్ర విధానానికి వ్యతిరేకం అనే వాదు 1918 జనవరిలో "కాన్స్టిట్యుయెంటు ఎసెంబ్లీ" ని రద్దుచేయడంవలన కలిగింది, కాని, "కాన్స్టిట్యుయంటు

ఎసంబ్లీ" అనేది బూర్జువాప్రభుత్వకాలంలో ఆందోళన జరపడానికి ఒక సాధనం మాత్రమేననీ. ప్రజాప్రాతినిధ్యం విషయంలో అదిసోవియట్లతో ఏమాత్రమూ సరిపోలదనీ చాలారోజులక్రితమే ఏప్రియలుథీసిసు నిరూపించింది. అంతేగాక సోషల్‌రివొల్యూషనరీపార్టీ ఒక్కటే సరియైన నాయకత్వంగల రాజకీయపక్షం అని తలపబడేరోజులలో వారి అభిప్రాయాలప్రకారం ఎన్నికలిస్టులు తయారు చేయబడ్డాయి. కాని నేడు ప్రజాబాహుళ్యం సోషల్‌రివొల్యూషనరీల నాయకత్వానికి విసుగుచెంది బోల్షివికులతో చేరేరు. అందుచేత ఆ లిస్టులన్నీ పాతబడిపోయి ప్రజాభిప్రాయానికి విరుద్ధం అయినాయి. ఆనాటికి ఇంకా ప్రభుత్వాధికారాన్ని వశపరచుకొనకపోయినా బోల్షివిక్‌పార్టీపై ప్రజాబాహుళ్యానికి ఎంత విశ్వాసం వుందో రెండవ అఖిలరష్యాసోవియటు కాంగ్రెసుఎన్నికలే ఋజువు చేసినాయి. ప్రతి—విప్లవనాయకులు విదేశాలనుంచి వచ్చిన ఆయుధాలతోటీ, ధనంతోటీ, సైన్యాలతోటీ, ప్రతిఘటించిననాడు—ఆ అంతర్యుద్ధ సమయంలో - ఎన్నో అవాంతరాలమధ్య ప్రపంచంలో కెల్లా బలిష్ఠమైన సామ్రాజ్యాలయొక్క సమ్మిళితప్రయత్నాలను ఎదిరించి జయం పొందినపుడు బోల్షివికు విప్లవానికిగల ప్రజాసహాయం ప్రత్యక్షంగా ఋజువు అయింది.)

మార్చిమొదలు నవంబరువరకుగల 8 నెలలు లెనిన్ నాయకత్వంలోని ఉత్తమతనీ, సాంద్రతనీ, స్పష్టం జేస్తున్నాయి. ఆ సమయంలో ఆతడు వ్రాసిన వ్రాతలన్నీ మార్క్సిస్టులకి శాశ్వతంగా ఉపకరిస్తాయి. తిరుగుబాట్లని ఏవిధంగా ప్రారంభించాలో నడిపించాలో సవిమర్శంగా నేర్పుతూన్నాయి. రాజ్యాంగయంత్రాన్ని అమర్చవలసిన పద్ధతికీ, దానియొక్క అర్థానికీ సంబంధించిన అత్యవసరప్రశ్నలన్నింటికీ సమాధానం ఇస్తూ; సామాజికవిప్లవంయొక్క అర్థాన్ని గూర్చి మార్క్సిస్టువిప్లవవాద విధానాన్ని వివరిస్తూ సోషల్‌డెమాక్రటిక్ ఉద్యమంలో బయలుదేరిన [illegible] ఖండిస్తూ అతడు తాను వ్రాసిన (State and Revo-

lution) "రాజ్యాంగయంత్రము-విప్లవము" అనే పుస్తకాన్ని ఈసమయం లోనే పూర్తిచేసేడు.

ఆ తరువాయి సంవత్సరాలలో అతడు నిర్వహించవలసిన సమస్యలు ఇంతకన్న ఘనమైనవే. కాని, అకాలమృత్యువు ఆబాధ్యతని తొలగించింది.

## ప్రపంచ విప్లవ నాయకత్వం.

20 వ శతాబ్దారంభంలో లెనిన్ ఒకవిషయం వ్రాసేడు.

"ఏదేశంలోనూ, ఎప్పుడూ, ఏకార్మికవర్గాన్ని ఎదుర్కొని యుండనంత-తీవ్రము- అత్యావశ్యకమునయిన కర్తవ్యాన్ని చరిత్ర మనమీద పెట్టింది. యూరపుతో ఒక్కచోటనే కాక, ఏషియాలో కూడా అభివృద్ధినిరోధకులకి మాంచి కోటలా వున్న ప్రభుత్వాన్ని కూలద్రోసి, ఆ కర్తవ్యాన్ని పూర్తిచేయవలసిన బాధ్యత అంతర్జాతీయకార్మికులకి, అగ్రస్థానంలో రష్యనుకార్మికుల్ని నిలువబెడుతూంది."

(ఏమి చేయాలి? ప్ర. 1)

వ్రాయబడిన 15 ఏళ్లకి, ప్రపంచ పరిస్థితులు ఎంతో తారుమారుగాను, క్లిష్టంగాను, వున్న సమయంలో ఈ జోస్యం ఫలించింది. 1917 నాటి విప్లవాలవలన, అందులోనూ ముఖ్యంగా నవంబరువిప్లవంవలన, రష్యనుశ్రామికవర్గం ప్రపంచకార్మికులకి అగ్రగామి కాగలిగింది. ప్రపంచ యుద్ధము చాలా తీవ్రంగా ఒకవైపున నడిచిపోతూంటే; యుద్ధంవలన, జారులరాజ్యవిధానం వలన తనకు నిలువనీడయయిన రష్యా పూర్తిగా దగ్ధపటలం అయిపోయిన సమయంలో! ప్రపంచంతో సంబంధము విడగొట్టి తనను ఏకాకిని చేసేస్తారేమోననే భయం ఒకవైపున ఉండగానే; ఇతరసహాయసైన్యాలు ఏవీ సిద్ధంకాకుండానే: పశ్చిమ-మధ్యమ-యూరపులలో విప్లవానికి నిలువడానికి కూడా ఆస్కారం లేనిసమయంలో; ముందుకుపోయి రష్యనుకార్మికవర్గం ఆ నాయకత్వాన్ని వహించవలసివచ్చింది.

ఇంత పెద్దపనిని, చరిత్రాత్మకమైన ఈ బాధ్యతని, ఏమాత్రపు జంకూ-కొంకూ లేకుండా వారు మనఃపూర్తిగా స్వీకరించేరు. ఈబాధ్యత

యొక్క స్వభావాన్ని గుర్తించి, ఎన్నడూ ఊహించడానికి కూడా వీలు కానంత దుర్భరక్లిష్టపరిస్థితులలో, దానిని పూర్తిచేయడానికి అనువైన మార్గాలు వెదకి బయటపెట్టినవాడు లెనినే. ప్రపంచవిప్లవానికి నాయకత్వం వహించడం; తమ్ము చుట్టుముట్టిన సామ్రాజ్యవాద ప్రభుత్వాల్ని ఓడించడం; రష్యాలో నూతనసమాజాన్ని నిర్మించడం: ఇవన్నీ ఒకే మారు చేయవలసి రావడంచేత మిక్కిలీ బరువైపోయిన ఆ బాధ్యతను నిర్వహించవలసిన భారం రష్యనుకార్మికులమీద-వారిని నడిపిస్తూన్న బోల్షివికులమీద- వారికి నాయకుడైన "లెనిన్" మీద పడింది. ఈమహాత్తరకార్యంలోని ప్రతివిషయాన్నీ కూడా లెనిను తన మనోబలంతోటీ, చిత్త-స్థైర్యంతోటీ, నిగ్రహించి, ఆగడ్డురోజులలో—1917—23 ల మధ్య సోవియటు ప్రభుత్వనౌకకి చుక్కానిలా, కమ్యూనిస్టుపార్టీ నాయకుడుగా, ఇంటర్నేషనలు నాయకుడుగా, తనపని పూర్తిచేసేడు. కాని ఆ భారం అధికం కావడంచేత శారీరకంగానూ-మానసికంగానూ-కూడా శిథిలం అయిపోయి అతడు అకాలమృత్యువు వాతబడ్డాడు. ప్రారంభించినపని పూర్తిచేయకుండానే అతడు మరణించినా తన తరువాతవారు దానిని పూర్తిచేసేటందుకు వీలుగా బాటలువేసేసి మరీ పోయేడు.

ఈమధ్యకాలంలో "లెనిన్" చేసినపనిని వివరించడానికి ఇంత చిన్నగ్రంథంలో సాధ్యపడదు. అలాగ వ్రాయడం అంటూ వస్తే ప్రపంచ రాజకీయాలు; సామ్రాజ్యవాద ప్రభుత్వాలతో సంబంధాలు; అంతర్యుద్ధం; నూతనసోవియటు ప్రజాతంత్రనిర్మాణం; సోషలిజానికి దారితీసే నూతన ఆర్థికవిధాననిర్మాణం; రైతులతో గల సంబంధం; ప్రపంచంలోని ప్రతి దేశంలోనుగల కార్మికోద్యమంతోగల ప్రత్యక్షసంబంధం-నాయకత్వము; కమ్యూనిస్టుపార్టీనిగూర్చి; ఇంకా ఈలాగంటివే ఎన్నో విషయాల్ని గూర్చి వ్రాయవలసివుంటుంది. ఈకాలంలో అతడు ఎన్నో వ్యాసాలు, ఉపన్యాసాలు, రిపోర్టులు, కరపత్రాలు వ్రాస్తూనే అతి క్లిష్టములయిన ఆరోజులలో కూడా "Proletarian Revolution and Kautsky the

Renagade; Left-wing Communism: an Infantile Disordar: An Attempt at a Popular Explanation of Marxist strategy and Tactico'' అనే రెండుపుస్తకాలు వ్రాసేడు. ఈరెండు పుస్తకాలూ అంతర్జాతీయ కార్మికోద్యమానికి ఎంతో సహాయకారులుగా వున్నాయి.

రష్యాలో బోల్షివికువిప్లవం జయం పొందడంతో సోషలిస్టు విప్లవానికి ప్రథమాంకం ఆరంభం అయింది.

కాని, 1917 నవంబరులో విప్లవం ఆరంభించినప్పుడు ప్రపంచ విప్లవంకోసం ఇంత దీర్ఘకాలం పోరాడవలసి యుంటుందని కాని, ఇన్ని క్లిష్టపరిస్థితులను ఎదుర్కోవలసివస్తుందని కాని, బోల్షివికులూ-లెనినూ కూడా ఊహించి యుండలేదు. తాము ఆరంభించిన కొద్దినెలల లోపుగానే యూరపులోని ప్రధానదేశాలన్నిటిలోనూ విప్లవజ్వాలలు తీవ్రంగా వ్యాపించగలవని వారు ఊహించేరు. సామ్రాజ్యవాద ప్రభుత్వారంభ దినాలలో ప్రపంచయుద్ధంలో ప్రవృత్తులయివున్న ప్రభుత్వాలకీ, ప్రజలకీ చేసిన శాంతి విజ్ఞాపనలు; డిసెంబరు—జనవరి నెలలలో జర్మను సామ్రాజ్యవాదంతో జరిపిన బ్రెస్టు సంధిప్రయత్నాలు: ఇవన్నీకూడా సామ్రాజ్యవాదులు ఆరంభించిన మారణహోమాన్ని ఆపుచేయమని ప్రజలను ఉద్బోధించడానికే ఉద్దేశించబడినాయి. 1918 జనవరి నెలలో జర్మనీ—ఆస్ట్రియాలలో సమ్మెలు కారుచిచ్చులా చెలరేగేయి. యుద్ధంతో విసిగిపోయిన జర్మనీ—ఫ్రాన్సు—ఇంగ్లాండు మొదలయిన దేశాలలో ప్రజా సామాన్యం, సమ్మెలు—సాయుధ విప్లవాలు ఆరంభించేరు. అయినా ఆయా దేశాలలోని బూర్జువా రాజ్యాంగయంత్రం చాలా సమర్థతతో నిర్వహించబడుతూ వుండడంచేత సోషల్‌డెమాక్రసీలోని జాతీయతను సహాయం దీసుకొని తమ అధికారాన్ని నిలుపుకోగలిగేరు. కనుకనే "బలాత్కారంగా రుద్దబడిన" "బ్రెస్టులిటోస్కు" సంధిపత్రంమీద రష్యా సంతకం పెట్టక తప్పిందికాదు. (1918 మార్చిలో) ఈపత్రంమీద సంతకం చేయవచ్చునా? కూడదా? అన్న ప్రశ్నమీద ఎన్నో చర్చలు జరిగి కొనకి

సోవియటు ప్రభుత్వం కాలూనుకోవాలంటే సంతకం పెట్టడానికే నిర్ణ యించబడింది. బోల్షివికులు అధికారంలోకి వచ్చినాక సోవియటుప్రభుత్వంతో వచ్చిచేరిన సోషల్‌రివొల్యూషనరీపార్టీలోని అతివాదకక్షివారు ఈ ప్రశ్నమీదనే 1918 వేసవిలో మళ్ళీ వేరయిపోయేరు. వీరు సోవియటుప్రభుత్వంమీద తిరుగుబాటు లేవదీయడానికి పాటుపడ్డారు. కాని, వారికి అణుమాత్రంకూడా ప్రజలు సహాయపడలేదు. 1918 మార్చి 18వ తేదీన "సోవియట్ సెంట్రల్ ఎక్జిక్యూటివ్ కమిటీ" ముందు "బ్రెస్టు" సంధిమీద సంతకం పెట్టవలసిన అగత్యాన్ని వివరిస్తూ "లెనిన్" ఈ విధంగా దానికి కారణం చెప్పేడు.

"ప్రస్తుతం మనం చాలా నిరాశాజనకమయిన క్లిష్టపరిస్థితులలో చిక్కుకొని యున్నాము. మనకు సహాయం వస్తారనుకొన్న స్నేహితులెవ్వరూ సాయం రాలేక పోయేరు. ఇంతలో అంతర్జాతీయ కార్మికవర్గం మనకి సహాయంగా రాలేదు. కాని, ఆవచ్చేరోజు ఎంతోదూరంగా లేదు."

"లెనిన్" అంచనా సరియైనదేనని తరువాత తేలింది. 1918 నవంబరులో జర్మనుకార్మికులు తిరుగుబాటుచేసి, కైజరుప్రభుత్వాన్ని కూలద్రోసి, బ్రెస్టుసంధిని రద్దుచేసి, యుద్ధాన్ని నిలుపుచేసేరు. 1918-21 ల మధ్య విజృంభించిన ప్రపంచవిప్లవతరంగం దీనితోనే బయలుదేరింది.

సామ్రాజ్యవాదయుద్ధం ఆగిపోవడంవలన రష్యాకు కలిగిన ప్రయోజనం ఏమీలేదు. యుద్ధం ఆఖరు సంవత్సరంలో సామ్రాజ్యవాద ప్రభుత్వాలు సోవియటువిధానాన్ని కూలద్రోయడానికి నాలుగువైపులనుంచీ దాడి ఆరంభించేయి. ఈయుద్ధం ఆగిపోవడంతోటే ఆ దాడులు మరీ తీవ్రరూపం దాల్చేయి. ఒక్కవరసన దేశం నాలుగుమూలలా అంతర్యుద్ధం చెలరేగింది. 1918 లో జర్మనుల దండయాత్రలు, దోపిడీలు, చెలరేగేయి. 1918—20 వరకు బ్రిటిష్-ఫ్రెంచి-అమెరికను-జాపానీస్-సైన్యాలు దేశం నాలుగుమూలలనుంచి అక్రమణలు సాగించేయి. ప్రతి—విప్లవనాయకులకి డబ్బు-ఆయుధాలు-సహాయం-పూర్తిగా ఈయబడింది.

విధ్వంసప్రయత్నాలు-హత్యాప్రయత్నాలు-కుట్రలు-విచ్చలవిడిగా ప్రోత్సహించబడినాయి. (1918 ఆగస్టు 20 వ తేదీన "లెనిన్"ను తుపాకీతో కాల్చి బాగా గాయపరచేరు. అతడు ఆ బాధనుంచి తర్వాత తర్వాత కోల్కొని మామూలుగా పనిలోనికి దిగినా, ముఖ్యంగా ఈ గాయాలు కారణంగానే అతడు అకాలమరణం పొందేడు.) అప్పటికింకా బాల్యావస్థలోనే యున్న సోషలిస్టు ప్రభుత్వాన్ని అణచివేయడానికై ప్రపంచ సామ్రాజ్యవాదప్రభుత్వాలు అవలంబించిన నీతి ఇది.

జర్మనీలో విప్లవం రాగానే జర్మనీ సామ్రాజ్యవాద ప్రభుత్వం రష్యాలో చేస్తూన్న వినాశం ఆఖరు అయింది. కాని మిత్రమండలివారి దాడులు 1919 లో మరీ తీవ్రంగా పరిణమించేయి. వీరు "వెర్సయిల్సు" సమావేశంలో "కోల్చక్" నియంతను రష్యను రీజంటుగా గుర్తించేరు. ఉత్తర రష్యాలో బ్రిటిషుసేనలు: దక్షిణాన ఒడెస్సాలో బ్రిటిషు-ఫ్రెంచి సేనలు; "పెట్రోగ్రాడ్" ప్రక్కలో "యుదేనిచ్"; సైబీరియాలో "కోల్చక్"; యూక్రెయిన్‌లో "పెట్లూరా"; దక్షిణాన "డెనైకిన్"; వీరంతా పాశ్చాత్య సామ్రాజ్యవాద ప్రభుత్వాలు పంపిన ఆయుధాలతోటీ, సైన్యనాయకులతోటీ సన్నద్ధులై బోల్షివిజాన్ని రూపుమాపడానికి నాలుగు మూలలా నడుము కట్టేరు.

కాని, సోవియటుప్రభుత్వాన్ని కూలద్రోయడానికై సామ్రాజ్యవాదులు చేసిన కోటియత్నాలూ కూటికీ కొరగాకుండా పోయినాయి. వారి ఓటమికి ముఖ్యకారణం రష్యనుప్రజల ప్రతిఘటనయే. రెడ్ఆర్మీ—పారిశ్రామికకార్మికులు మాత్రమేగాక విద్రోహులు ఆక్రమించిన ప్రదేశాలలోని రైతులుకూడా ఈ ప్రతిఘటనను తీవ్రతరం చేసేరు, విద్రోహుల ఆక్రమణం స్థిరం అయిపోయిందంటే రైతుల స్వాధీనంలో యున్న భూమి మళ్లీ లాగివేయబడుతుంది. ఈకారణంచేతనే రైతులంతా బోల్షివికుల పక్షం వహించేరు. దీనికితోడు బ్రిటిషు—ఫ్రెంచిసైన్యాలు అమా

శించేయి. (ఫ్రెంచివారి నల్లసముద్రపు నౌకాదళం చేసిన తిరుగుబాటు; ఉత్తరరష్యాలోని బ్రిటిషుసేనలలో వ్యాపించిన అసంతృప్తి; కొత్త సేనల్ని పంపలేక పోవడం;) మూడోకారణం బ్రిటిషు—ఫ్రెంచికార్మికులు ఈదండయాత్రకి విరుద్ధంగా చేసిన ఆందోళనము. 1919 లో ప్రపంచవిప్లవతరంగం మంచి ఉన్నతస్థితిలో వుంది. 1919 వసంత ర్తువులో కమ్యూనిస్టు ఇంటర్నేషనలు స్థాపించబడింది. రష్యాలో సోవియటు రిపబ్లికుతో సామ్రాజ్యవాదులు జరుపుతూన్న పోరాటాన్ని అంతర్జాతీయ కార్మికవర్గం అంతం పొందించింది,

1920 ఆఖరున "రేంగిల్" అపజయంతో ప్రతివిప్లవము-దండయాత్రలు చాలవరకు ఆఖరు అయినట్లే; 1920 వేసవిలో జరిగిన పోలండు యుద్ధంతో విప్లవానికీ-ప్రతివిప్లవానికీ జరుగుతూన్న ప్రత్యక్ష పోరాటం పారం ముట్టింది. యుద్ధవిరామసంధికోసం—రాయబారాలు నడపడానికి సోవియట్లు తరుచుగా పంపుతూన్న ఆహ్వానాన్ని నిరాకరించి పోలండు బ్రిటను-ఫ్రాన్సుల సైనికపరికరాలతోటీ—వారి సేనాధిపతుల సహాయంతోటీ—సోవియట్లమీద తీవ్రయుద్ధానికి తలపడింది. కాని, ఈ యుద్ధంలో పోలిషుసేనలు పూర్తిగా పరాజయం పొందేయి. పైపెచ్చు సోవియటుసేనలు వార్సాకి కొలదిమైళ్ళ దూరంవరకూ తీసుకువచ్చేయి. సైనికదృష్ట్యా వార్సామీద దాడివెడలడం ఉచితం కాదు. ఆ ప్రయత్నం విఫలం కాకతప్పదు. కాని, కొన్నిరాజకీయకారణాలచేత "లెనిను" ఆ బాధ్యతను తనమీదనే వేసుకొన్నాడు. ఈదండయాత్రే యూరపువిప్లవం యొక్క అదృష్టాన్ని నిర్ణయించింది. ఇది లెనిన్‌యొక్క రాజనీతి చాతుర్యానికి ఒకగొప్ప ఉదాహరణం. అవసరం వచ్చినప్పుడు చెదిరి పోకుండా జాగ్రత్తగా, వెనుకఅడుగు పెట్టుకుంటూ కాచుకొనే నేర్పుని, బ్రెస్టుసంధీ-దాని తరువాత ప్రవేశపెట్టిన నవీనఆర్థికనీతి-వలన స్పష్టం అవుతూంది. (బోల్షివిక్ విప్లవంకంటె ఇవే చాలాముఖ్యమైనట్లు బూర్జువా రాజకీయవేత్తలు ఈరెంటికీ అధికప్రాముఖ్యతనిచ్చి "లెనిన్" యొక్క

రాజకీయనైపుణి అంతా వీనిలోనే కేంద్రీకరింపబడియుందని వ్రాసేరు.) అలాగే వార్సాదాడి ప్రయోజనం కనిపిస్తూ, అవసరం వస్తే, ఎన్ని ఆటం కాలువచ్చినా నిర్భయంగా దెబ్బతీయడానికి సిద్ధంగా వున్నట్లు నిరూపిం చింది. ఈదాడి ఓడిపోయినా, లాభకరమే అయిందని లెనిను వాదిం చేడు; (1920 సెప్టెంబరులో అఖిలరష్యా కమ్యూనిష్టుపార్టీకాన్ఫరెన్సులో "లెనిన్" చదివిన రిపోర్టు.) ఇందుకుగల మొదటి కారణం—పాశ్చాత్య సామ్రాజ్యవాద ప్రభుత్వాలకి ఈదాడిలో సోవియట్లబలం తెలిసిపోయి, చొరుచుకొని వచ్చిపడే తీవ్రతని నిరోధించింది. రెండోకారణంపాశ్చాత్య కార్మికోద్యమానికి అది ఎంతో ఉత్తేజనాన్ని ఇచ్చింది. ఈవిషయం "బ్రిటిష్‌కౌన్సిల్ ఆఫ్ ఏక్షన్" లో స్పష్టం అయింది.

1921 ప్రారంభంనుంచీ ప్రపంచం అంతటా నవీన పరిస్థితులు ఏర్పడి అభివృద్ధి పొందేయి. ఒకవైపున సోవియటు ప్రభుత్వాన్ని కూల్చ డానికి సామ్రాజ్యవాద ప్రభుత్వాలు చేసిన ప్రయత్నాలను, అంతర్జాతీయ కార్మికవర్గం భగ్నం చేసివేసింది. మరొకవైపున ఒక్కరష్యాలో మిన హాగా మరి ఎక్కడా ఏసామ్రాజ్యవాద ప్రభుత్వాన్నీ అంతర్జాతీయ కార్మిక వర్గం కూలత్రోయలేకపోయింది. దీనికి ఫలస్వరూపంగా తాత్కాలికంగా నైనా "బలాబలాల సమానత" ఏర్పడింది. ఈసమానత ఎంతకాలం వుంటుందో చెప్పడం కష్టం. కాని, ఈవిరామసమయంలో వీలు చిక్కి నంతవరకు కార్మికవర్గాన్ని సంఘబద్ధంచేసి, తయారుచేయాలి. మళ్లీ సామ్రాజ్యవాదులు దాడి ప్రారంభించడమో, లేక ప్రపంచవిప్లవతరంగం బయలుదేరడమో తటస్థించే లోపుగానే ఈపని జరిగిపోవాలి. ఈనూతన పరిస్థితుల్ని ఎదుర్కొనడం ఎలాగ? 1921 లో నూతనశకం ఆరంభం అయింది. ఈశకం ఆఖరు అయిపోవచ్చిన సూచనలు కనిపిస్తూన్నా అదే ఇంకా నడుస్తూంది. ఈశకంలో బయలుదేరిన సమస్యల్ని పరిష్క రించే పద్ధతి నేర్పడంలోనే "లెనిన్" ఆఖరు పర్యాయం నాయకత్వం వహించేడు.

మొట్టమొదట సోవియట్లలోనే సంపూర్ణంగా మార్పు తేవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. బోల్షివిక్ విప్లవానికి ముందు—వెనకకూడా, భవిష్యత్తులో సోషలిజం ఏర్పడేటందుకు సహాయపడేటట్లు ఉత్పత్తి విధానం మీద కార్మికప్రభుత్వం అధికారం వహించింది. కాని, అంతర్యుద్ధాలు—ఆక్రమణలు—ఈఏర్పాట్లని నిరోధించి, "వార్—కమ్యూనిజం" అవలంబించేటట్లు ఒత్తిడి తెచ్చేయి. అంటే ఉత్పత్తివిషయంలో సోషలిష్టు విధానం అవలంబించబడకపోయినా వస్తువులను వసూలుచేసి పంచిపెట్టడంలో—మాత్రం సోషలిస్టు విధానం అవలంబించబడింది. ఇప్పుడు ఆపద్ధతి ఆపివేయవలసిన అగత్యం ఏర్పడింది. అంతర్యుద్ధాలు ఆగిపోయినాయి. ఆర్థికపునర్నిర్మాణం విషయంలో మొట్టమొదట ఏర్పరచుకొన్న విధానం తిరిగి అవలంబించవలసిన రోజు వచ్చింది. 1921 ఆరంభంలో బయలుదేరిన "క్రాన్‌స్టాట్" విప్లవం—"టాంబోవ్" విప్లవం, ఈసమస్యను శీఘ్రంగా పరిష్కరించవలసిన ఆవశ్యకతని సూచించేయి. పరిస్థితులకి తగినట్లుగానే మార్చి 1921 లో నవీన ఆర్థికనీతి అవలంబించబడింది. వస్తువులను వసూలుచేసే పద్ధతికి బదులు వ్యవసాయపు పన్ను వేయబడింది. చిల్లర చిల్లరగా వర్తకం జరుపుకొనేటందుకు కొద్దిపాటి సౌకర్యాలు ఈయబడినాయి. ప్రధానములయిన ఆర్థికసంస్థల నన్నింటినీ కార్మికప్రభుత్వం తనచేతిలోనే వుంచికొంది. విదేశీయ వర్తకం; బ్యాంకింగ్; రహదారీలు; పెద్దపెద్ద పరిశ్రమలు; అన్నీ ప్రభుత్వం చేతిలోనే పున్నాయి. ఈపద్ధతివలన ఉత్పత్తిని ఒక క్రమవిధానాన్ని అనుసరించి సమాజపరం చేయడానికి అనువు ఏర్పడుతుంది.

ఆరోజులలోను, అటుతర్వాత కొద్ది సంవత్సరాలదాకాను కూడా సాలూ—మూలం దెలియని పెట్టుబడిదారులయొక్క—సంస్కరణవాదులయొక్క విమర్శనలు నవీన ఆర్థికనీతిని ఒక్కవిధంగా హేళన చేసేయి. ఈనవీన ఆర్థికనీతిద్వారా. సోవియట్లు సోషలిజానికి పోయేదారిని విడిచి

పెట్టుబడిదారీ తత్వాన్నే అనుసరిస్తున్నట్లు వారు ఊహించేరు. కాని నిజానికి ఇదేమీ నిజం కాదు. ఈవిషయాన్నిగూర్చి లెనినే చెప్పేడు జాగ్రతగా—తెలివితేటలతో—సోషలిజంకేసి దారితీస్తున్నామే కాని, వేర కాదని అతడు నిరూపించేడు. ఆవిషయం ఈనాటికి అందరికీ స్పష్ట అయింది. నవీన ఆర్థికనీతి ద్వారా పెట్టుబడిదారీ తత్వం అమలులోకి వస్తుందనే ప్రాతకాలపు జోస్యాలన్నీ చిత్తుకాగితాల బుట్టలో పడిపో యేయి. ఆ క్రమబద్ధ పరిణామక్రమం పంచవర్షప్రణాళికద్వారా ఉత్పత్తి అధికాధికంగా సమాజపరం చేయబడింది. "లెనిన్" బ్రతికియున్నరోజ లలో జారుప్రభుత్వం వలన అంతర్యుద్ధాలవలన కలిగిన దేశనాశనాన్ని సోషలిజానికి అంటకట్టి (ప్రత్యేకంగా విద్రోహులు—దోపిడిగాండ్రచేత విధ్వంసం చేయబడి—విడిచిపెట్టబడిన రాష్ట్రాలలో 1921 లో వచ్చిన కఱువును.) అమెరికాలోను—పశ్చిమ యూరపుఖండంలోను పెట్టుబడిదారీ విధానం చూపిన అభివృద్ధితో పోలిస్తే సోషలిజం వట్టి "దివాలా సిద్ధాం తం" అని బూర్జువా ప్రచారకులు ప్రచారం చేయసాగేరు. నేటికి నాల గేళ్ళనుంచి (1933 లో వ్రాసినప్పటికి) పెట్టుబడిదారీవిధానంలో అనివా ర్యంగా తటస్థపడే ఆర్థికమాంద్యంవలన ప్రపంచం అంతటా ఉత్పత్తి తగ్గిపోయింది. పెట్టుబడిదారీదేశాలన్నింటిలోనూ నిరుద్యోగం ప్రబలింది క్షోభలు విజృంభించేయి. ఇటువంటి పరిస్థితులలో ఒక్క సోవియట యూనియనే ఇంతవరకు చరిత్రలో ఎన్నడూ కని విని ఎరుగనట్లుగ దేశోత్పత్తిని రెండూ మూడురెట్లు అధికం చేసింది. అందుచేత అదుప్పువారాలేక నేడు సాగడం లేదు. ఇంత అభివృద్ధికి కారణం "లెనిన్" వేసిపోయిన మార్గమే. కానయితే దానిని "లెనిను" చూడలేక పోయేడు.

అదే సమయంలో అంతర్జాతీయ కార్మికోద్యమం ఉత్తరోత్తర అభివృద్ధి పొందాలంటే తాత్కాలికంగా కాపుదలలో వెనుక తగ్గవలసిన పరిస్థితులు ఏర్పడినాయి. కొత్త గా యేర్పడిన కమ్యూనిసుపార్టీలు తామ

ప్రత్యక్షయుద్ధరంగంనుంచి వెనుకకి మళ్ళి కార్మికవర్గంలో వారిదైనందినావశ్యకతలకోసం పోరాటం జరపడం ద్వారా పలుకుబడి సంపాదిస్తూ, తమపక్షాన్ని బలపరుచుకోవలసియుంది. 1921 వేసవిలో "లెనిన్" నాయకత్వాన జరిగిన "కమ్యూనిస్టు ఇంటర్నేషనలు" యొక్క మూడవ కాంగ్రెసు ఈవిషయమై ఎక్కువ కృషి చేసింది. అదే సంవత్సరం డిసెంబరులో సమ్మిళితశ్రామిక వర్గ సంఘటన (United working-class front) "లెనిన్" పరిశీలనక్రింద అభివృద్ధిపరచబడింది.

"కార్మికవర్గ శక్తుల్ని తయారుచేసి, సంఘనిర్మాణానికి శ్రద్ధగా పూనుకోవలసియున్న ఈ "విరామసమయం"-"బలాబలాల సమానత" ఎంతకాలంవుంటుంది? ఊహించి చెప్పడం కష్టమే."

1921 సంత్సరం ఆఖరు రోజులలో లెనిన్ ఈమాటలన్నాడు.

"బలాబలాలు ఎలాగయితేనేం సమానత్వాన్ని పొందేయి. కాని, ఇది అట్టే కాలం నిలిచేదికాదు. ఏమయితేనేం? బలాబలాలు సమానం అయినాయి. ఇది చాలా కాలం నడుస్తుందా అంటే నేను చెప్పలేను. ఎవ్వరయినా చెప్పగలరని కూడా అనుకోను. అందుచేత ఈలోపుగానే మనం మన శక్తి సంతనూ వినియోగించి పని చేయాలి."

(తొమ్మిదవ అఖిలరష్యా సోవియటుకాంగ్రెసులో ఇచ్చిన ఉపన్యాసం డిసెంబరు 23, 1921.)

మళ్ళీ 1921 నవంబరు నెలలో జరిగిన నాల్గవ "కమ్యూనిస్టు ఇంటర్నేషనలు" సమావేశంలో అదేమాట "లెనిన్" చెప్పేడు.

"నేటికి మొట్టమొదటి మారుగా కొంచెం నేర్చుకుందుకు అవకాశం చిక్కింది, ఈఅవకాశం ఎంతవరకు వుంటుందో నేను చెప్పలేను. పెట్టుబడిదారీ ప్రభుత్వాలు మనల్ని ఈవిధంగా శాంతంగా ఎంత కాలం నేర్చుకోనిస్తారో చెప్పలేను. కాని, యుద్ధబాధలేని ప్రకృతసమయంలో ప్రతిక్షణాన్ని మనం వినియోగంలోనికి తెచ్చుకోవాలి. ప్రతిచిన్న విషయాన్నీ మనం జాగ్రతగా పరిశీలించి నేర్చుకోవాలి.........

పెట్టుబడిదారీ తత్వాన్నే అనుసరిస్తూన్నట్లు వారు ఊహించేరు. కాని నిజానికి ఇదేమీ నిజం కాదు. ఈవిషయాన్నిగూర్చి లెనినే చెప్పేడు. జాగ్రతగా—తెలివితేటలతో—సోషలిజంకేసి దారితీస్తున్నామే కాని, వేరు కాదని అతడు నిరూపించేడు. ఆవిషయం ఈనాటికి అందరికీ స్పష్టం అయింది. నవీన ఆర్థికనీతి ద్వారా పెట్టుబడిదారీ తత్వం అమలులోకి వస్తుందనే ప్రాతకాలపు జోస్యాలన్నీ చిత్తుకాగితాల బుట్టలో పడిపోయేయి. ఆ క్రమబద్ధ పరిణామక్రమం పంచవర్షప్రణాళికద్వారా ఉత్పత్తి అధికాధికంగా సమాజపరం చేయబడింది. "లెనిన్" బ్రతికియున్నరోజులలో జారుప్రభుత్వం వలన అంతర్యుద్ధాలవలన కలిగిన దేశనాశనాన్ని సోషలిజానికి అంటకట్టి (ప్రత్యేకంగా విద్రోహులు—దోపిడిగాండ్రచేత విధ్వంసం చేయబడి—విడిచిపెట్టబడిన రాష్ట్రాలలో 1921 లో వచ్చిన కఱువును.) అమెరికాలోను—పశ్చిమ యూరపుఖండంలోను పెట్టుబడిదారీ విధానం చూపిన అభివృద్ధితో పోలుస్తే సోషలిజం వట్టి "దివాలా సిద్ధాంతం" అని బూర్జువా ప్రచారకులు ప్రచారం చేయసాగేరు. నేటికి నాలుగేళ్ళనుంచి (1933 లో వ్రాసినప్పటికి) పెట్టుబడిదారీవిధానంలో అనివార్యంగా తటస్థపడే ఆర్థికమాంద్యంవలన ప్రపంచం అంతటా ఉత్పత్తి తగ్గిపోయింది. పెట్టుబడిదారీదేశాలన్నింటిలోనూ నిరుద్యోగం ప్రబలింది. క్షోభలు విజృంభించేయి. ఇటువంటి పరిస్థితులలో ఒక్క సోవియటు యూనియనే ఇంతవరకు చరిత్రలో ఎన్నడూ కని విని ఎరుగనట్లుగా దేశోత్పత్తిని రెండూ మూడురెట్లు అధికం చేసింది. అందుచేత ఆదుష్ప్రచారాలేవీ నేడు సాగడం లేదు. ఇంత అభివృద్ధికీ కారణం "లెనిన్" వేసిపోయిన మార్గమే. కానయితే దానిని "లెనిను" చూడలేక పోయేడు.

అదే సమయంలో అంతర్జాతీయ కార్మికోద్యమం ఉత్తరోత్తరా అభివృద్ధి పొందాలంటే తాత్కాలికంగా కాపుదలలో వెనుక తగ్గవలసిన పరిస్థితులు ఏర్పడినాయి. కొత్తగా యేర్పడిన కమ్యూనిసుపార్టీలు తాము

ప్రత్యక్షయుద్ధరంగంనుంచి వెనుకకి మళ్ళీ కార్మికవర్గంలో వారిదైనందీ నావశ్యకతలకోసం పోరాటం జరపడం ద్వారా పలుకుబడి సంపాదిస్తూ, తమపక్షాన్ని బలపరుచుకోవలసియుంది. 1921 వేసవిలో "లెనిన్" నాయకత్వాన జరిగిన "కమ్యూనిస్టు ఇంటర్నేషనలు" యొక్క మూడవ కాంగ్రెసు ఈవిషయమై ఎక్కువ కృషి చేసింది. అదే సంవత్సరం డిసెంబరులో సమ్మిళితశ్రామిక వర్గ సంఘటన (United working-class front) "లెనిన్" పరిశీలనక్రింద అభివృద్ధిపరచబడింది.

"కార్మికవర్గ శక్తుల్ని తయారుచేసి, సంఘనిర్మాణానికి శ్రద్ధగా పూనుకోవలసియున్న ఈ"విరామసమయం"-"బలాబలాల సమానత" ఎంతకాలంవుంటుంది? ఊహించి చెప్పడం కష్టమే."

1921 సంవత్సరం ఆఖరు రోజులలో లెనిన్ ఈమాటలన్నాడు.

"బలాబలాలు ఎలాగయితేనేం సమానత్వాన్ని పొందేయి. కాని, ఇది ఆట్టే కాలం నిలిచేదికాదు. ఏమయితేనేం? బలాబలాలు సమానం అయినాయి. ఇది చాలా కాలం నడుస్తుందా అంటే నేను చెప్పలేను. ఎవ్వరయినా చెప్పగలరని కూడా అనుకోను. అందుచేత ఈలోపుగానే మనం మన శక్తిసంతనూ వినియోగించి పని చేయాలి."

(తొమ్మిదవ అఖిలరష్యా సోవియటుకాంగ్రెసులో ఇచ్చిన ఉపన్యాసం డిసెంబరు 23, 1921.)

మళ్ళీ 1921 నవంబరు నెలలో జరిగిన నాల్గవ "కమ్యూనిస్టు ఇంటర్నేషనలు" సమావేశంలో అదేమాట "లెనిన్" చెప్పేడు.

"నేటికి మొట్టమొదటి మారుగా కొంచెం నేర్చుకుందుకు అవకాశం చిక్కింది, ఈఅవకాశం ఎంతవరకు వుంటుందో నేను చెప్పలేను. పెట్టుబడిదారీ ప్రభుత్వాలు మనల్ని ఈవిధంగా శాంతంగా ఎంతకాలం నేర్చుకోనిస్తారో చెప్పలేను. కాని, యుద్ధబాధలేని ప్రకృతసమయంలో ప్రతిక్షణాన్ని మనం వినియోగంలోనికి తెచ్చుకోవాలి. ప్రతిచిన్న విషయాన్నీ మనం జాగ్రతగా పరిశీలించి నేర్చుకోవాలి.......

"ప్రస్తుతం నడుస్తూన్న ఈవిరామసమయంలో మనం అనేక విషయాల్ని గూర్చి నేర్చుగొనేటందుకే ముఖ్యంగా ప్రయత్నించాలి. ఈవిషయం నేను చెప్పుతూన్నది, ఒక్కరష్యనులకే కాదు. విదేశీయులకి కూడా ఇంత ఘట్టినమ్మకంతోటీ చెబుతూన్నాను. కాని మన రష్యనుల విషయంలో "నేర్చుకోవాలి" అన్నదానికి విశేషార్థం ఏమీ లేదు. ఇతరుల విషయంలోమాత్రం దానికి ప్రత్యేకమైన అర్థంవుంది. విదేశీయులు విప్లవకార్యక్రమంయొక్క నిర్మాణం-స్వరూపం-క్రమపద్ధతి-దాని స్వభావం-మొదలయిన వానినిగూర్చి సంపూర్ణమైన శిక్షణ పొందాలి. మీరీ పనిచేస్తే ప్రపంచవిప్లవానికి అనుకూలపరిస్థితులు ఏర్పడడమే కాకుండా అద్భుతంగా నడుస్తుంది,"

"లెనిన్" ప్రపంచానికి చెప్పగలిగిన మాటలలో ఇవే ఆఖరువి. 1922 వసంతంలో అతని ప్రాణాలకే ఎసరు పెట్టిన ఆభయంకరరోగం పక్షవాతరూపంలో కుడిచేతిని, కుడికాలిని ఆక్రమించింది. తర్వాత కొద్దినెలలకి ఆరోగంనుంచి కోలుకోగలిగేడు. మళ్లీ పని ఆరంభించేడు. కాని, అతనిశరీరం-మనస్సు-కూడా-అవసన్నం అయిపోయి వెనుకటిలా పని చేయలేకపోయేడు. 1923 వసంతంలో రెండవమారు పూర్వంకన్న తీవ్రరూపంలో పక్షవాతం వచ్చింది. 1923 మే నెలలో అతడు "సహకారవిధానాన్ని" గూర్చి వ్రాయడమే ఆఖరుసారి. "మనకి గలఅవకాశా" లన్నింటిద్వారా "సంపూర్ణంగా సోషలిజాన్ని స్థాపించేటందుకై" తగిన మార్గాన్ని ఆగ్రంథంలో వివరించేడు.

"మనం ఇంకా సోషలిస్టుప్రభుత్వాన్ని స్థాపించలేదు. కాని, దాని స్థాపనకు అవసరములయిన అవకాశాలన్నీ మనకు ఉన్నాయి."

అతడు ఎన్నోనెలలపాటు మృత్యువుతో పోరాడేడు. ఆఖరుకి 1924 జనవరి 21 వ తేదీన మరణించేడు.

1917—23 ల మధ్య ప్రపంచవిప్లవ నిర్వహణంకోసం "లెనిన్" తన జీవితంయొక్క అస్తమయ సమయంలోచేసిన కృషి బ్రహ్మాండ

# మూడో ప్రకరణం

## లెనిన్ ఉపదేశాలు.

ఆధునికయుగంలో మానవసమాజాన్ని ఎదుర్కొనే సమస్యలన్నిం టికీ "లెనిన్" తన రచనలోను, నిత్యకార్యక్రమంలోను కూడా విస్పష్ట ములైన సమాధానాలను ఇచ్చేడు. ఈ సమాధానా లేవీ అతని అంత రాత్మలో హఠాత్తుగా జన్మించినవి గాని, నూతనంగా కనిపెట్టి బయట పెట్టినవి గాని కాదు. అతడు ఒక సిద్ధాంతాన్ని గాని, మతాన్నిగాని, ఒక నూతనవిధానాన్నిగాని సృష్టించియుండలేదు. ఎన్నోయుగాలు పరిణామం పొందుతూవచ్చి "మార్క్సిజం" లో పారంముట్టిన మానవుని ఆలోచ నలు—విజ్ఞానముయొక్క అనంతసాధనమీదనే దానిని నిర్మించేడు. మహ త్తరమైన "మార్క్సిస్టు" కార్యక్రమాన్ని ముందుకు సాగించలేక, కేవలం దానికి భారభూతులుగా తయారయిన పిరికిపందలు, ద్రోహులు, అల్పబుద్ధులునగు వారి భారానికి అది ఉక్కిరిబిక్కిరియై, అపాయస్థితిలో పడిపోతారన్న సమయంలో "లెనిన్" వానిని ఆదుకున్నాడు. ఆదుకొని దానిని మహత్తరమైన విప్లవశక్తినిగా తయారుచేసేడు. ఆధునికయుగ శక్తు లన్నింటిలోకీ మంచి బలవత్తరమైన దానినిగా గుర్తింపచేసేడు. ఆఖరుకి విప్లవోద్యమంలో విజయం చేకూర్చి మరీ మరణించేడు.

మార్క్సుసిద్ధాంతాలలాగే వానికి అనుబంధం వంటిదైన "లెని నిజం" కూడా ఏవో కొన్ని నిర్దిష్టనియమాలలో నిర్బంధించి వుంచేటం దుకు వీలు చిక్కేది కాదు. క్లుప్తంగా చెప్పబోతే దానిలోని గొప్ప దనము—సర్వతోముఖత్వము—జీవము పోవచ్చును. అంతే కాదు. ఆ విధంగా ఆసిద్ధాంతాలను ఒక విధానానికి లోబరచడం అనేది కూడా వాని యొక్క గతితార్కిక స్వభావానికి విరుద్ధమే. "గతితార్కిక" పరిశీలనం ఏయుగానికి ఆయుగంలోనే వర్తమానములయియుండే ప్రతినిర్దిష్టవిష యాన్నీ, వానిప్రత్యేక స్వభావాలనీ, వానికిగల పరస్పరసంబంధాలనీ, విడబరచిచెప్పుతుంది. ప్రత్యేకము, నిర్దిష్టమునైన, క్రమపద్ధతిలో పరి

యొక్క ఫలమే కాని, వేరుకాదనీ, ఎన్నోయుగాల అనుభవాలను, అందులోనూ ప్రత్యేకంగా పెట్టుబడిదారీ యుగంలోని అనుభవాలను–జాగ్రత్తగా చదివి పరిశీలించినమీదనే అది నిర్మించబడినదనీ తరుచుగా హెచ్చరించేడు. 1920లో "రష్యన్ కమ్యూనిస్టుయూత్ కాంగ్రెస్" లో మాటలాడుతూ లెనిను ఈ విషయాన్నే చెప్పేడు.

"మానవ విజ్ఞానకోశాన్ని స్వాయత్తం చేసుకోనిదే ఎవ్వడైనా కమ్యూనిస్టును కాగలననుకోవడం గొప్ప పొరపాటు. వివిధ విజ్ఞాన శాస్త్రాలయొక్క పరిణామస్వరూపమే "కమ్యూనిజం." కనుక ఆ యా వివిధవిజ్ఞాన శాస్త్రాల్ని హృత్కవిలిగా తెలుసుకోకుండ, కేవలం కమ్యూనిజంలోని సూత్రాలనూ-ధానియొక్క సిద్ధాంతాలనూ- చదివితే చాలు కమ్యూనిస్టును కాగలననుకొనడం వెర్రివెంగళాయతనం..........

మానవవిజ్ఞాన పరిణామాన్ని మనస్సుకు పట్టించుకోనివాడు "కమ్యూనిస్టు" అనుకొనడం వట్టిబూటకం—దగా—కోతలు."

అందుచేతనే అతడు యువకులకి—

"మానవవిజ్ఞానాన్ని సంపూర్ణంగా అలవరుచుకొనండి, కమ్యూనిజం అనేది పుస్తకాలు కంఠస్థం చేస్తే వచ్చేది కాదు. దానినిగూర్చి మీఅంతట మీరే ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రండి. ఆధునికవైజ్ఞానికదృక్పథంతో పరిశీలిస్తే ఇది అనివార్యంగా వచ్చి తీరుతుందని తేలిపోతుంది."

—అని హితోపదేశం చేసేడు. అదేవిధంగా "శ్రామికవర్గవిజ్ఞానం" మీద బయలుదేరిన వాదోపవాదాలను గూర్చి చెప్పుతూ కూడా "లెనిన్" ఇదే అభిప్రాయం వెలిబుచ్చేడు.

"మార్క్సిజం అనేది విప్లవకరమైన శ్రామికవర్గంయొక్క సిద్ధాంతం అని ప్రపంచం అంతటా పేరు మ్రోసింది. ఏమంటే మార్క్సిజం బూర్జువాయుగంలో సాధింపబడిన అమూల్యవిషయాలను కాదనడంలేదు. పైపెచ్చు వాటిని స్వాయత్తం చేసుకుంటూంది. మానవుని బుద్ధిబలం

రెండువేలయేండ్లుగా సంపాదిస్తూవచ్చిన అమూల్యములైన వైజ్ఞానికవిష యాలను పరిశీలించి మార్క్సిజం వానికి నూతనరూపం ఇచ్చింది."

(శ్రామికవర్గ విజ్ఞానాన్నిగూర్చిన చిత్తు తీర్మానం 1920)

ఆవిధంగా లెనిను మార్క్సిజాన్ని ఏవో వెర్రినమ్మకాలమీద ఆధారపడియున్న ఒకవిధానంగా కాక, వేరువేరు మానవవిజ్ఞానశాఖల పరిణామఫలితం అయిన శాస్త్రీయదృక్పథంగా నిశ్చయించేడు. మానవ విజ్ఞాన వికాసాన్ని శాస్త్రీయదృష్ట్యా పర్యాలోచించేదే మార్క్సిజం అని నిర్ణయించేడు. విజ్ఞానంలోని ఏ ఒకటి—రెండుశాఖలకి సంబంధించినంత వరకో గాక సంపూర్ణంగా జీవితానికీ—అస్తిత్వానికీ సంబంధించినంత వరకు సిద్ధాంతరంగంలోను—కార్యాచరణలోనూ కూడా ఒకేమారు సశా స్త్రీయమైన పరిశీలనాదృష్టిని ప్రసాదించినది మార్క్సిజమే.

మార్క్సిస్టు దృక్పథమే గతితార్కిక భౌతికవాదదృక్పథం. దానిని గురించి ఈగ్రంథంయొక్క మొదటిప్రకరణంలో వివరించేను. "లెనిన్" గతితార్కిక భౌతికవాది. ప్రతిసమస్యనుగూర్చి, వానికీ-మానవజీవితానికీ-గల సంబంధాన్నిగూర్చి; తాను ఏర్పాటుచేసుకొన్న గమ్యాలూ—వానిని సాధించడంలో అనుసరించవలసిన మార్గాలనుగూర్చి; వివరించడంలో అతడు ప్రదర్శించిన ప్రతిభ—అనుసరించినకార్యవిధానము కూడా అద్వి తీయం. జీవితాన్నిగూర్చి, అస్తిత్వాన్నిగూర్చి, మానవకృత్యాలనుగూర్చి చారిత్రక పరిణామసూత్రాలనుగురించి, వర్గసమాజ నిబంధనలకి లోబడి వుంటూనే ముందుకు సాగడానికిగల విధానాలు—పద్ధతులనుగూర్చి మాన వులంతా తమంత తామే నిర్ణయించుకోవలసిన భవిష్యత్ప్రపంచ పరి స్థితుల్నిగురించి అతనికి గల శాస్త్రీయపరిజ్ఞానమే అతని యా తెలివితేట లకి గల మూలం. దూరదృష్టిలేక, స్వార్థపరులయి, వెర్రిమొర్రి అభిప్రా యాలలో పాదుకుపోయిన బూర్జువా రాజనీతివేత్తల్నీ, సిద్ధాంతవేత్తల్నీ, ఎదుర్కొగల శక్తి "లెనిన్" కి దీనివలననే కలిగింది. గతితార్కిక

భౌతికవాద సిద్ధాంతంలోని యాథార్థ్యాన్నీ, సమర్థతనీ, అతడు తన జీ
కాలంలో నెరవేర్చిన కార్యాలే స్పష్టపరుస్తూన్నాయి.

గతితార్కిక భౌతికవాదం అన్నది అన్నిసిద్ధాంతాలలాగా పాత
పోవడానికి అదేమీ విగతి తాత్వికవిధానం (Meta-Physics) కాదు. క్ర
శకంలోను విజ్ఞానం పరిణామాన్ని పొందినకొలదీ, జ్ఞానాభివృద్ధి
పాటు ఏంగిల్సు చెప్పినట్లు అదికూడా పునస్సంస్కారం పొందవ
యుంటుంది. "లెనిన్" తన "భౌతికవాదము : సామ్రాజ్యవాద విమ
వము." (Meterialism and Empireo-Criticism) అనే పుస్తకంలో
పనినే నిర్వహించేడు. 20 వ శతాబ్దంలో విజ్ఞానశాస్త్రాలలో బయలుదే
నూతనసమస్యలను ఈపుస్తకంలో గతితార్కిక భౌతికవాదరీత్యా అ
యించేడు. ఆ గతితార్కికవాదంలోకి బూర్జువాశాస్త్రవేత్తల సంరక్ష
క్రింద ప్రవేశిస్తూన్న అభివృద్ధివిరోధకములయిన ఆదర్శవాద—మూ
వాద—మతవాదాభిప్రాయాలతో పోరాటం సాగించి దానిని ముందు
తీసుకొనిపోగలిగేడు.

శాస్త్రీయపర్యాలోచనం సాగించాలంటే ప్రతీవాడూ భౌతికవ
దృష్టి కలిగియుండాలని "లెనిన్" స్పష్టం చేసేడు. అతడు మతా
"మతంతో సంబంధం గల అన్ని సిద్ధాంతాలనీ నిర్భయంగా ఖండించేడు
ఈ "మతపిచ్చి"— ఇంచుమించు మతసిద్ధాంతాలతో సారూప్యం క
వుండే ఆదర్శవాద పద్ధతులు, భ్రమలు, మానవుని బుద్ధివికాసా
విరోధం కల్పిస్తున్నాయని చాటి చెప్పేడు. ఎంత "ఆధునికములై
కృత్రిమశాస్త్రకవచాలలో దాగియున్నా అవి "మతపిచ్చి" కి మారురూ
లేయని నిరూపించేడు. అంటే—ప్రస్తుత సమాజవిధానమే స్వర్గతుల్
అని, అద్భుతనిర్మాణం అని, పొగడుతూ దాసత్వాన్ని సమర్థించ
తప్ప వేరు కాదు అనీ, నిర్మలమైన ఆలోచనకి ఈమతపిచ్చి తా
ఈయదనీ, యాథార్థ్యాన్ని ఎదుర్కొనడానికి అవకాశం ఈయద
చెప్పేడు.

భౌతికవాద సిద్ధాంతంలోని యాథార్థ్యాన్నీ, సమర్థతనీ, అతడు తన జీవిత
కాలంలో నెరవేర్చిన కార్యాలే స్పష్టపరుస్తూన్నాయి.

గతితార్కిక భౌతికవాదం అన్నది అన్నిసిద్ధాంతాలలాగా పాతప
పోవడానికి అదేమీ విగతి తాత్వికవిధానం (Meta-Physics) కాదు. ప్ర
శకంలోను విజ్ఞానం పరిణామాన్ని పొందినకొలదీ, జ్ఞానాభివృద్ధితో
పాటు ఏంగిల్సు చెప్పినట్లు అదికూడా పునస్సంస్కారం పొందవల
యుంటుంది. "లెనిన్" తన "భౌతికవాదము: సామ్రాజ్యవాద విమ
వము." (Meterialism and Empireo-Criticism) అనే పుస్తకంలో
పనినే నిర్వహించేడు. 20 వ శతాబ్దంలో విజ్ఞానశాస్త్రాలలో బయలుదేరి
నూతనసమస్యలను ఈపుస్తకంలో గతితార్కిక భౌతికవాదరీత్యా అ
యించేడు. ఆ గతితార్కికవాదంలోకి బూర్జువాశాస్త్రవేత్తల సంరక్ష
క్రింద ప్రవేశిస్తూన్న అభివృద్ధివిరోధకములయిన ఆదర్శవాద—మా
వాద—మతవాదాభిప్రాయాలతో పోరాటం సాగించి దానిని ముందు
తీసుకొనిపోగలిగేడు.

శాస్త్రీయపర్యాలోచనం సాగించాలంటే ప్రతీవాడూ భౌతికవ
దృష్టి కలిగియుండాలని "లెనిన్" స్పష్టం చేసేడు. అతడు మతా
"మతంతో సంబంధం గల అన్ని సిద్ధాంతాలనీ నిర్భయంగా ఖండించేడు
ఈ "మతపిచ్చి"— ఇంచుమించు మతసిద్ధాంతాలతో సారూప్యం క
వుండే ఆదర్శవాద పద్ధతులు, భ్రమలు, మానవుని బుద్ధివికాసా
విరోధం కల్పిస్తున్నాయని చాటి చెప్పేడు. ఎంత "ఆధునికములై
కృత్రిమశాస్త్రకవచాలలో దాగియున్నా అవి "మతపిచ్చి" కి మారురు
లేయని నిరూపించేడు. అంటే—ప్రస్తుత సమాజవిధానమే స్వర్గతు
అని, అద్భుతనిర్మాణం అని, పొగడుతూ దాసత్వాన్ని సమర్థించ
తప్ప వేరు కాదు అనీ, నిర్మలమైన ఆలోచనకి ఈమతపిచ్చి
ఈయదనీ, యాథార్థ్యాన్ని ఎదుర్కొనడానికి అవకాశం ఈయద
చెప్పేడు.

యాథార్థ్యం గ్రహించాలంటే చాలా కష్టం. దానికెంతో శాస్త్ర జ్ఞానం అవసరం. అందుచేతనే పూర్వకాలంనాటి విప్లవవాదరహితము-యాంత్రికములైన భౌతికవాదము సత్యాన్ని గ్రహించలేకుండా వుందని అతడు నిరూపించేడు. అది ఆ యాథార్థ్యాన్ని గ్రహించలేకపోవడం చేతనే శాస్త్రజ్ఞానం విశాలం అయినకొలదీ శాస్త్రజ్ఞులకి తానేమీ దారిచూప లేక గంద్రగోళంలో వదలివేసి ఆదర్శవాద సిద్ధాంతాల దయాదాక్షిణ్యాలకి వదిలివేసింది. ఒక్క గతితార్కిక భౌతికవాదం మాత్రమే ఈ పరిస్థితు లలో ముందు దారి చూపగలదు.

"ఏప్రకృతిశాస్త్రంగాని, ఏభౌతికవాదంగాని, సరియైన తాత్త్వికజ్ఞానంమీద ఆధారపడి బయలుదేరకపోతే బూర్జువా భావాల్ని ఎదిరించలేదు. బూర్జువాతత్వశాస్త్ర పునరుద్ధారణ ప్రయత్నాలకి వ్యతిరేకంగా జరుపబడే పోరాటంలో నిలువబడలేదు. ఈపోరాటం పెంపొందించడానికీ, దానిని ముందుకు సాగించడానికీ, ప్రతిశాస్త్రజ్ఞుడూ ఆధునిక భౌతికవాది అయితీరాలి. మార్క్సు చెప్పే భౌతికవాద విధానాన్ని సంపూర్ణంగా గ్రహించి, దానిని అనుసరించేవారు అయితీరాలి. అంటే అతడు గతితార్కిక భౌతికవాది కావాలి..........

మార్క్సు హెగెలియన్ గతితార్కికవాదానికి భౌతికవాదరీత్యా వ్యాఖ్యానం వ్రాసేడు. ప్రకృతిశాస్త్ర విజ్ఞానంలో తీవ్రమైన మార్పులు ఘటిల్లేసమయంలో బయలుదేరిన ఎన్నో తాత్త్వికప్రశ్నలకి అతడు దానిల్లో సరియైన సమాధానాల నిచ్చేడు. ఆప్రశ్నలకి కంగారుపడి బూర్జువా పద్ధతుల్ని అభిమానించే బుద్ధిమంతులంతా అభివృద్ధి నిరోధకులుగా తయారయ్యేరు. వారు మన సహాయం తీసుకొని పరిశోధన సాగిస్తే ఆ ప్రశ్నలకి సరియైన వివరణం ఆవ్యాఖ్యానంలో పొందగలరు."

(Meaning of Militent Meterialism. 1922.)

"లెనినే" ఇంకొకచోట—

"మార్క్సిజంలోగల ప్రధానాంశం దానియొక్క గతితార్కిక విప్లవవాదమే!"

(Concerning our Revolution)

ణామం పొందే సాధారణ సామాజికసూత్రాలను నిర్ణయించి, వానికి అనువైన కర్తవ్యాలు నిరూపిస్తుంది. అందుచేతనే మార్క్సిజాన్నిగాని, లెనినిజాన్నిగాని, తెలుసుకోవాలంటే, పుస్తకాలు చదువుతే చాలదనడం. ఈప్రయత్నంలో మొట్టమొదట మార్క్సు—లెనినుల రచనలు చదువుకోవాలి. తాము పనిచేసిన కాలంలో తటస్థపడిన ఆయా నిర్దిష్టచారిత్రక సంఘర్షణలలో వారు ఏవిధంగా మెలిగేరో తెలుసుకోవాలి. పురాతన కాలంనాటి ఛాందసధోరణిని విడిచిపెట్టి, వారిసిద్ధాంతాలను వర్తమాన యుగంలోని ప్రకృతపరిస్థితులకి అనువర్తింపచేయడంకోసం పోరాడుతూ విప్లవోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొనవలసియుంటుంది. "లెనిన్" గాని, "మార్క్సు" గాని, తమ సిద్ధాంతాలకి సంగ్రహగ్రంథాలు తయారుచేసి పోలేదు. సిద్ధాంతరంగంలోను, కార్యరంగంలోను, కూడా ఎదుర్కొన్న అత్యవసరసమస్యలను పరిష్కరించే క్రమంలోనే వారు తమ సిద్ధాంతాలను స్పష్టం చేసేరు.

అందుచేత "లెనిన్" ఉపదేశాలలోని కొన్ని ప్రత్యేకవిషయాల్ని గురించి, నేనిక్కడ వ్రాయబోతూవున్న సంగ్రహవివరణాన్ని అతని ఉపదేశాలకి అనుబంధం అనుకోవద్దు. సంగ్రహం అంతకన్నా కాదు. "లెనిన్" ఉపదేశాలు ఇంతే అనుకొనడానికి వీలూ లేదు.

## లెనిన్ యొక్క ప్రపంచ దృక్పథం

మార్క్సుయొక్క విప్లవదృక్పథం—కార్యక్రమము—కూడా ప్రపంచ పరిమితము—విశాలమునైన దృక్పథం — పర్యవేక్షణమీద ఆధారపడి అతడు జీవించిన ప్రత్యేకశకములోని ప్రత్యేకపరిస్థితులతో అవినాభావ సంబంధం కలిగివుంటాయి. "లెనిన్" విషయంలోకూడా అంతే.

"కమ్యూనిజం" అనేది ఏవో సిద్ధాంతాలు—అంధవిశ్వాసాలు ఏరి కూర్చినది కాదని "లెనిన్" మాటిమాటికీ చెప్పుతూ వచ్చేడు. ఏవో పాఠ్యపుస్తకాలు చూసి వమనుకొనడానికి అవేవీ "స్థిరత్వం పొందిన నిర్ణయాలు" కావు అన్నాడు. కేవలం మానవుని శాస్త్రజ్ఞానము—విజ్ఞానము

యొక్క ఫలమే కాని, వేరుకాదనీ, ఎన్నోయుగాల అనుభవాలను, అందులోనూ ప్రత్యేకంగా పెట్టుబడిదారీ యుగంలోని అనుభవాలను—జాగ్రత్తగా చదివి పరిశీలించినమీదనే అది నిర్మించబడినదనీ తరుచుగా హెచ్చరించేడు. 1920లో "రష్యన్ కమ్యూనిస్టుయూత్ కాంగ్రెస్" లో మాటలాడుతూ లెనిను ఈ విషయాన్నే చెప్పేడు.

"మానవ విజ్ఞానకోశాన్ని స్వాయత్తం చేసుకోనిదే ఎవ్వడైనా కమ్యూనిస్టును కాగలననుకోవడం గొప్ప పొరపాటు. వివిధ విజ్ఞాన శాస్త్రాలయొక్క పరిణామస్వరూపమే "కమ్యూనిజం." కనుక ఆ యా వివిధవిజ్ఞాన శాస్త్రాల్ని హృత్కవిలిగా తెలుసుకోకుండ, కేవలం కమ్యూనిజంలోని సూత్రాలనూ-దానియొక్క సిద్ధాంతాలనూ- చదివితే చాలు కమ్యూనిస్టును కాగలననుకొనడం వెర్రిపెంగళాయతనం.........

మానవవిజ్ఞాన పరిణామాన్ని మనస్సుకు పట్టించుకోనివాడు "కమ్యూనిస్టు" అనుకొనడం వట్టిబూటకం—దగా—కోతలు."

అందుచేతనే అతడు యువకులకి—

"మానవవిజ్ఞానాన్ని సంపూర్ణంగా అలవరుచుకొనండి, కమ్యూనిజం అనేది పుస్తకాలు కంఠస్థం చేస్తే వచ్చేది కాదు. దానినిగూర్చి మీఅంతట మీరే ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రండి. ఆధునికవైజ్ఞానికదృక్పథంతో పరిశీలిస్తే ఇది అనివార్యంగా వచ్చి తీరుతుందని తేలిపోతుంది."

—అని హితోపదేశం చేసేడు. అదేవిధంగా "శ్రామికవర్గవిజ్ఞానం" మీద బయలుదేరిన వాదోపవాదాలను గూర్చి చెప్పుతూ కూడా "లెనిన్" ఇదే అభిప్రాయం వెలిబుచ్చేడు.

"మార్క్సిజం అనేది విప్లవకరమైన శ్రామికవర్గంయొక్క సిద్ధాంతం అని ప్రపంచం అంతటా పేరు మ్రోసింది. ఏమంటే మార్క్సిజం బూర్జువాయుగంలో సాధింపబడిన అమూల్యవిషయాలను కాదనడంలేదు. పైపెచ్చు వాటిని స్వాయత్తం చేసుకుంటూంది. మానవుని బుద్ధిబలం

రెండువేలయేండ్లుగా సంపాదిస్తూవచ్చిన అమూల్యములైన వైజ్ఞానికవిష యాలను పరిశీలించి మార్క్సిజం వానికి నూతనరూపం ఇచ్చింది."

(శ్రామికవర్గ విజ్ఞానాన్నిగూర్చిన చిత్తు తీర్మానం 1920)

ఆవిధంగా లెనిను మార్క్సిజాన్ని ఏవో వెర్రినమ్మకాలమీద ఆధారపడియున్న ఒకవిధానంగా కాక, వేరువేరు మానవవిజ్ఞానశాఖల పరిణామఫలితం అయిన శాస్త్రీయదృక్పథంగా నిశ్చయించేడు. మానవ విజ్ఞాన వికాసాన్ని శాస్త్రీయదృష్ట్యా పర్యాలోచించేదే మార్క్సిజం అని నిర్ణయించేడు. విజ్ఞానంలోని ఏ ఒకటి—రెండుశాఖలకి సంబంధించినంత వరకో గాక సంపూర్ణంగా జీవితానికీ—అస్తిత్వానికీ సంబంధించినంత వరకు సిద్ధాంతరంగంలోను—కార్యాచరణలోనూ కూడా ఒకేమారు సశా స్త్రీయమైన పరిశీలనాదృష్టిని ప్రసాదించినది మార్క్సిజమే.

మార్క్సిస్టు దృక్పథమే గతితార్కిక భౌతికవాదదృక్పథం. దానిని గురించి ఈగ్రంథంయొక్క మొదటిప్రకరణంలో వివరించేను. "లెనిన్" గతితార్కిక భౌతికవాది. ప్రతిసమస్యనుగూర్చీ, వానికీ-మానవజీవితానికీ-గల సంబంధాన్నిగూర్చీ; తాను ఏర్పాటుచేసుకొన్న గమ్యాలూ—వానిని సాధించడంలో అనుసరించవలసిన మార్గాలనుగూర్చీ; వివరించడంలో అతడు ప్రదర్శించిన ప్రతిభ—అనుసరించినకార్యవిధానము కూడా అద్వి తీయం. జీవితాన్నిగూర్చి, అస్తిత్వాన్నిగూర్చి, మానవకృత్యాలనుగూర్చి, చారిత్రక పరిణామసూత్రాలనుగురించి, వర్గసమాజ నిబంధనలకి లోబడి వుంటూనే ముందుకు సాగడానికిగల విధానాలు—పద్ధతులనుగూర్చి మాన వులంతా తమంత తామే నిర్ణయించుకోవలసిన భవిష్యత్ప్రపంచ పరి స్థితుల్నిగురించి అతనికి గల శాస్త్రీయపరిజ్ఞానమే అతని యా తెలివితేట లకి గల మూలం. దూరదృష్టిలేక, స్వార్థపరులయి, వెర్రిమొర్రి అభిప్రా యాలలో పాదుకుపోయిన బూర్జువా రాజనీతివేత్తల్నీ, సిద్ధాంతవేత్తల్నీ, ఎదుర్కొగల శక్తి "లెనిన్" కి దీనివలననే కలిగింది. గతితార్కి

యాథార్థ్యం గ్రహించాలంటే చాలా కష్టం. దానికెంతో శాస్త్ర జ్ఞానం అవసరం. అందుచేతనే పూర్వకాలంనాటి విప్లవవాదరహితము—యాంత్రికములైన భౌతికవాదము సత్యాన్ని గ్రహించలేకుండా వుందని అతడు నిరూపించేడు. అది ఆ యాథార్థ్యాన్ని గ్రహించలేకపోవడం చేతనే శాస్త్రజ్ఞానం విశాలం అయినకొలదీ శాస్త్రజ్ఞులకి తానేమీ దారిచూపలేక గంద్రగోళంలో వదలివేసి ఆదర్శవాద సిద్ధాంతాల దయాదాక్షిణ్యాలకి వదిలివేసింది. ఒక్క గతితార్కిక భౌతికవాదం మాత్రమే ఈ పరిస్థితులలో ముందు దారి చూపగలదు.

"ఏ ప్రకృతిశాస్త్రంగాని, ఏభౌతికవాదంగాని, సరియైన తాత్త్వికజ్ఞానంమీద ఆధారపడి బయలుదేరకపోతే బూర్జువా భావాల్ని ఎదిరించలేదు. బూర్జువాతత్వశాస్త్ర పునరుద్ధారణ ప్రయత్నాలకి వ్యతిరేకంగా జరుపబడే పోరాటంలో నిలువబడలేదు. ఈపోరాటం పెంపొందించడానికీ, దానిని ముందుకు సాగించడానికీ, ప్రతిశాస్త్రజ్ఞుడూ ఆధునిక భౌతికవాది అయితీరాలి. మార్క్స్ చెప్పే భౌతికవాద విధానాన్ని సంపూర్ణంగా గ్రహించి, దానిని అనుసరించేవారు అయితీరాలి. అంటే అతడు గతితార్కిక భౌతికవాది కావాలి............

మార్క్స్ హెగెలియన్‌గతితార్కికవాదానికి భౌతికవాదరీత్యా వ్యాఖ్యానం వ్రాసేడు. ప్రకృతిశాస్త్ర విజ్ఞానంలో తీవ్రమైన మార్పులు ఘటిల్లేసమయంలో బయలుదేరిన ఎన్నో తాత్వికప్రశ్నలకి అతడు దానిల్లో సరియైన సమాధానాల నిచ్చేడు. ఆప్రశ్నలకి కంగారుపడి బూర్జువా పద్ధతుల్ని అభిమానించే బుద్ధిమంతులంతా అభివృద్ధి నిరోధకులుగా తయారయ్యేరు. వారు మన సహాయం తీసుకొని పరిశోధన సాగిస్తే ఆ ప్రశ్నలకి సరియైన వివరణం ఆవ్యాఖ్యానంలో పొందగలరు."

(Meaning of Militent Meterialism. 1922.)

"లెనినే" ఇంకొకచోట—

"మార్క్సిజంలోగల ప్రధానాంశం దానియొక్క గతితార్కిక విప్లవవాదమే!"

(Concerning our Revolution)

భౌతికవాద సిద్ధాంతంలోని యాథార్థ్యాన్నీ, సమర్థతనీ, అతడు తన జీవిత కాలంలో నెరవేర్చిన కార్యాలే స్పష్టపరుస్తూన్నాయి.

గతితార్కిక భౌతికవాదం అన్నది అన్నిసిద్ధాంతాలలాగా పాతపడి పోవడానికి అదేమీ విగతి తాత్వికవిధానం (Meta-Physics) కాదు. ప్రతి శకంలోను విజ్ఞానం పరిణామాన్ని పొందినకొలదీ, జ్ఞానాభివృద్ధితో పాటు ఏంగిల్సు చెప్పినట్లు అదికూడా పునస్సంస్కారం పొందవలసి యుంటుంది. "లెనిన్" తన "భౌతికవాదము : సామ్రాజ్యవాద విమర్శ నము." (Meterialism and Empireo-Criticism) అనే పుస్తకంలో ఈ పనినే నిర్వహించేడు. 20 వ శతాబ్దంలో విజ్ఞానశాస్త్రాలలో బయలుదేరిన నూతనసమస్యలను ఈపుస్తకంలో గతితార్కిక భౌతికవాదరీత్యా అన్వయించేడు. ఆ గతితార్కికవాదంలోకి బూర్జువాశాస్త్రవేత్తల సంరక్షణ క్రింద ప్రవేశిస్తూన్న అభివృద్ధివిరోధకములయిన ఆదర్శవాద—మాయా వాద—మతవాదాభిప్రాయాలతో పోరాటం సాగించి దానిని ముందుకు తీసుకొనిపోగలిగేడు.

శాస్త్రీయపర్యాలోచనం సాగించాలంటే ప్రతీవాడూ భౌతికవాద దృష్టి కలిగియుండాలని "లెనిన్" స్పష్టం చేసేడు. అతడు మతాన్ని "మతంతో సంబంధం గల అన్ని సిద్ధాంతాలనీ నిర్భయంగాఖండించేడు." ఈ "మతపిచ్చి"— ఇంచుమించు మతసిద్ధాంతాలతో సారూప్యం కలిగి వుండే ఆదర్శవాద పద్ధతులు, భ్రమలు, మానవుని బుద్ధివికాసానికి విరోధం కల్పిస్తున్నాయని చాటి చెప్పేడు. ఎంత "ఆధునికములైన" కృత్రిమశాస్త్రకవచాలలో దాగియున్నా అవి "మతపిచ్చి" కి మారురూపా లేయని నిరూపించేడు. అంటే—ప్రస్తుత సమాజవిధానమే స్వర్గతుల్యం అని, అద్భుతనిర్మాణం అని, పొగడుతూ దాసత్వాన్ని సమర్థించడం తప్ప వేరు కాదు అనీ, నిర్మలమైన ఆలోచనకి ఈమతపిచ్చి తావు ఈయదనీ, యాథార్థ్యాన్ని ఎదుర్కొనడానికి అవకాశం ఈయదనీ; చెప్పేడు.

యాథార్థ్యం గ్రహించాలంటే చాలా కష్టం. దానికెంతో శాస్త్ర జ్ఞానం అవసరం. అందుచేతనే పూర్వకాలంనాటి విప్లవవాదరహితము–యాంత్రికములైన భౌతికవాదము సత్యాన్ని గ్రహించలేకుండా వుందని అతడు నిరూపించేడు. అది ఆ యాథార్థ్యాన్ని గ్రహించలేకపోవడం చేతనే శాస్త్రజ్ఞానం విశాలం అయినకొలదీ శాస్త్రజ్ఞులకి తానేమీ దారిచూప లేక గంద్రగోళంలో వదలివేసి ఆదర్శవాద సిద్ధాంతాల దయాదాక్షిణ్యాలకి వదిలివేసింది. ఒక్క గతితార్కిక భౌతికవాదం మాత్రమే ఈ పరిస్థితు లలో ముందు దారి చూపగలదు.

"ఏప్రకృతిశాస్త్రంగాని, ఏభౌతికవాదంగాని, సరియైన తాత్త్వక జ్ఞానంమీద ఆధారపడి బయలుదేరకపోతే బూర్జువా భావాల్ని ఎదిరించ లేదు. బూర్జువాతత్వశాస్త్ర పునరుద్ధారణ ప్రయత్నాలకి వ్యతిరేకంగా జరుపబడే పోరాటంలో నిలువబడలేదు. ఈపోరాటం పెంపొందించ డానికీ, దానిని ముందుకు సాగించడానికీ, ప్రతిశాస్త్రజ్ఞుడూ ఆధునిక భౌతిక వాది అయితీరాలి. మార్క్సు చెప్పే భౌతికవాద విధానాన్ని సంపూర్ణంగా గ్రహించి, దానిని అనుసరించేవారు అయితీరాలి. అంటే అతడు గతి తార్కిక భౌతికవాది కావాలి.........

మార్క్సు హెగెలియన్‌గతితార్కికవాదానికి భౌతికవాదరీత్యా వ్యాఖ్యానం వ్రాసేడు. ప్రకృతిశాస్త్ర విజ్ఞానంలో తీవ్రమైన మార్పులు ఘటిల్లేసమయంలో బయలుదేరిన ఎన్నో తాత్వికప్రశ్నలకి అతడు దానిల్తో సరియైన సమాధానాల నిచ్చేడు. ఆప్రశ్నలకి కంగారుపడి బూర్జువా వద్ద తుల్ని అభిమానించే బుద్ధిమంతులంతా అభివృద్ధి నిరోధకులుగా తయా రయ్యేరు. వారు మన సహాయం తీసుకొని పరిశోధన సాగిస్తే ఆ ప్రశ్న లకి సరియైన వివరణం ఆవ్యాఖ్యానంలో పొందగలరు."

(Meaning of Militent Meterialism. 1922.)

"లెనినే" ఇంకొకచోట—

"మార్క్సిజంలోగల ప్రధానాంశం దానియొక్క గతితార్కిక విప్లవవాదమే!"

(Concerning our Revolution)

సిద్ధాంతాలకీ—కార్యాచరణకీ మధ్యగల అడ్డంకుల్ని గతితార్కిక భౌతికవాదం తొలగిస్తూంది. ప్రపంచపర్యాప్తదృక్పథంగల గతితార్కిక వాదంయొక్క కర్తవ్యం యథార్థపరిస్థితుల స్వభావాలను కనిపెట్టడమే కాదు. ఆపరిస్థితుల్ని కూడా అది మార్చివేయవలసి యుంటుంది. అందుచేతనే దానిస్వభావం విప్లవకరం అయింది. సిద్ధాంతానికీ, కార్యాచరణకీ గల ఈ ఏకత్వం; అన్నిసమస్యల్నీ గతితార్కికభౌతికవాదరీత్యా పరిష్కరించే ఈపద్ధతి; "లెనిన్" జీవితం అంతటిలోనూ స్పష్టంగా ప్రదర్శించబడింది. అతని కార్యవిధానం అంతా కూడా ఏదో మహత్తరార్థసాధనకే. మానవుని అవసరాలు—ప్రపంచముయొక్క గతివిధానం ఈ రెండింటినీ శాస్త్రీయంగా విమర్శించి అతడు తెలుసుకున్నాడు. అంతటి సంపూర్ణ జ్ఞానయుతము— అప్రమత్తము— సిద్ధాంతానుగుణ్యమునైన కార్యాచరణ చరిత్రలో ఇంకెక్కడా కనపడదు. ఈవిధంగా తన జీవితకార్యముల ద్వారాను, కార్యసాధనద్వారాను, "లెనిన్" భవిష్యత్తులో ఏర్పడవలసిన నూతనమానవసమాజ నిర్మాణానికి మార్గాలు చూపించేడు.

### ఆధునికయుగసిద్ధాంతం: సామ్రాజ్యవాదం.

ఒకప్రత్యేకదశలోని—మార్క్సిస్టులు లేక కమ్యూనిస్టుల కార్యక్రమం—ఆయా దశలలోని పరిస్థితుల స్వభావం, ఆనాటి సమాజంలోవి వివిధశక్తులు, వాని మధ్యగల వైరుధ్యాలు, వానికి ఫలితంగా ఏర్పడే భవిష్యదభివృద్ధిమార్గాలు- ఇన్నింటియొక్క వివరణంమీద ఆధారపడి యుంటుంది.

మార్క్సు మానవసమాజంలోని పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క స్వభావాన్ని వివరించి, దానియొక్క గతిసూత్రాలను బయటపెట్టి, ఈఅవస్థలో పెట్టుబడి అభివృద్ధి పొందుతూనే కేంద్రీకృతం అవుతుందనీ, వర్గాలు విభజింపబడిపోతాయనీ, ప్రజ లంతకంతకి దరిద్రులు అవుతూంటారనీ, ఆర్థికక్లేశాలు ఏర్పడుతూంటాయనీ, ఆఖరుకి వీనికి ఫలితంగా

కార్మికవిప్లవం వచ్చి, భవిష్యత్తులో వర్గరహితమైన సోషలిస్టుసమాజాన్ని నిర్మించడానికై శ్రామికవర్గ నియంతృత్వం ఏర్పడి తీరుతుందని నిరూపించేడు.

కాని, మార్క్సు జీవితకాలంలో శ్రామికవిప్లవం-శ్రామికవర్గ నియంతృత్వం అనేవి సిద్ధాంతరూపంలోనే వుండిపోయేయి. రాబోయే విప్లవంకి సూచనవంటిదైన పారిస్–కమ్యూన్, ఒక్కదాంట్లోనూ మినహాగా భవిష్యత్తులో ఆచరణకివచ్చే సిద్ధాంతమాత్రంగానే అవి వుండి పోయాయి.ఆనాటికింకా అభివృద్ధికరమైన శక్తిగానే ఉన్న పెట్టుబడిదారీ వ్యవస్థక్రింద– శ్రామికవర్గశక్తుల్ని సంఘబద్ధంచేసి తయారు చేయడం లోనే అతడు తన నాయకత్వం నిర్వహించేడు.

మార్క్సు చనిపోయేక "లెనిన్" కాలంలోనే పెట్టుబడిదారీవిధానం తన చరమదశను ప్రవేశించింది. శ్రామికవర్గవిప్లవం ఆరంభం అయింది.

మార్క్సు చనిపోయిన క్రొత్తలో పెట్టుబడిదారీవిధానం ప్రవేశిస్తూన్న ఈ నూతనదశయొక్క స్వభావం మార్క్సిస్టులకే అర్థంకాలేదు. ఈనూతనదశయొక్క లక్షణాలు అనేకప్రదేశాలలో అనేకవిధాలుగా కన పడసాగేయి. వాటి కన్నిటికీ మూలకారణం ఏమిటో ఎవ్వరికీ తెలియదు. మార్క్సువేసిన అంచనాలన్నీ వ్యర్థం అయినట్లు ఈ నూతనపరిస్థితులు సూచిస్తూన్నాయనీ, కాన, అతని అంచనాలను సంస్కరించవలసియున్న దనీ "మార్క్సిస్టులం" అనుకొనేవారిలోనే పెక్కుమంది నిర్ణయించ సాగేరు. వేరువేరుగా వ్యక్తులు వ్యాపారం జరుపుతూవుండేవారు ఇది వరకు. ఇప్పుడు అవ్యాపారపద్ధతిమారి జాయింట్-స్టాక్‌పద్ధతి పెచ్చు పెరిగింది. ఇదిచూసి చాలమంది "పెట్టుబడి ప్రజలఅధీనం" అయిందని అపోహపడ్డారు. సాంఘికసంస్కారచట్టాలు, యూరపు–అమెరికాలలోని ప్రజాసామాన్యముయొక్క జీవితవ్యయపరిమాణంలో కలిగిన అభివృద్ధి ఇవి మార్క్సుచెప్పిన వర్గస్పర్థలు—ప్రజాదారిద్ర్యం, పెరుగుతూందనే

విషయాన్ని ప్రత్యాఖ్యానం చేస్తూన్నట్లు ఊహించేరు. అదే సమయంలో సామాజికఉదారవాదసిద్ధాంతాలకి విరుద్ధంగా రాజ్యాంగనీతిలో ఎన్నో పరిణామాలు ఏర్పడినాయి. యుద్ధపరికరాలు ఒకరిమీద నొకరు పోటీ పడి పెంచివేయసాగేరు. సైనికపరిపాలనా పద్ధతి (Militarism) క్రమంగా పెచ్చు పెరుగుతూంది. ఎగుమతి—దిగుమతుల్ని నిషేధిస్తూ సున్కం గోడలు కట్టబడిపోతున్నాయి. వలసరాజ్యాల ప్రజల్ని దోచుకొనడంలో నూతనమార్గాలు అవలంబించ బడుతూన్నాయి. ప్రపంచం నాలుగు మూలలా దౌర్జన్యం స్వేచ్ఛగా ప్రదర్శింపబడుతూంది. ఈ మార్పులన్నీ చూచి "సాంఘిక ఉదార సిద్ధాంతవాదు" లంతా కంగారుపడిపోయి ఇది యుగస్వభావానికే విరుద్ధం అని మొరపెట్టసాగేరు. పెట్టుబడిదారీవర్గం తమకు కలిగే లాభాల్నికూడా గుర్తించలేక ఈవిధంగా తమ కాళ్ళమీద తామే కొట్టుకుంటున్నారని వ్రేలుమొగం వేయసాగేరు. "లెనిన్" 1916 లో తాను వ్రాసిన "సామ్రాజ్యవాదం" అనే పుస్తకంలో ఈనూతనయుగ స్వభావాన్ని పూర్ణంగా వివరించి, దానియొక్క గతిసూత్రాలను బయట పెట్టేడు.

ఈనూతనయుగ లక్షణాలన్నింటినీ, మూలమట్టుగా "ఇజారా" పద్ధతినుంచీకూడా (Monopoly Capitalism) ఆతడు వివరించేడు. చిన్న తరహాల వ్యాపారాలయొక్క పోటీకారణంగా స్వేచ్ఛావాణిజ్య సిద్ధాంతం బయలుదేరిందని మార్క్సు చెప్పేడు. దీనివలన వర్తకులలో ఎవ్వనికి ఎక్కువ పెట్టుబడియుంటే అతడు నెగ్గడానికి అవకాశం ఇచ్చింది. క్రమంగా పెట్టుబడి ఒకచోట కేంద్రీకరించబడిపోతూంది. చిట్టచివరికి ఈస్వేచ్ఛావాణిజ్య పద్ధతి "ఇజారా" పద్ధతి లేక "నగదుపెట్టుబడి" (Finance-Capital) లోకి పరిణామం పొందుతుందని మార్క్సు సూచించేడు. పెద్దపెద్ద సిండికేట్ల ట్రస్టులు, ఒక్కచేతిక్రింద నడిపించబడుతూ బ్యాంకులధనాన్నీ—పరిశ్రమలధనాన్నీ కలియబోసి, రాజ్యాంగయంత్రంతో కలసి మెలసియుంటూ పనిచేస్తాయని దీని అర్థం.

ఈ "ఇజారా" పద్ధతి పూర్వకాలపు స్వేచ్ఛావాణిజ్యపద్ధతికి స్వస్తి చెప్పి పెట్టుబడిదారీవిధానాన్ని నూతనమార్గాలలోకి తిప్పించి, ప్రపంచం అంతటికీ "ఇజారా" సంపాదించేటందుకు; దోపిడి నిర్విఘ్నంగా సాగించేటందుకు; ప్రత్యేకంగా మినహాయింపుప్రదేశాలను సంపాదించేటందుకు; మార్కెట్లు, ప్రత్యేకాధికారాలకోసం; పోరాటాలు ఆరంభం అయినాయి. పెద్దపెద్దప్రభుత్వాలన్నీ ప్రపంచం అంతటినీ తమలో తాము పంచివేసుకున్నాయి. వలసరాజనీతి కాఠిన్యం వహించ సాగింది. ఎగుమతి—దిగుమతి సుంకాలు—మిలిటరీగ్రాంట్లు—లాభాలు— హెచ్చు కాసాగేయి. వలసరాజ్యనీతికి అనుగుణంగా పెట్టుబడియొక్క దిగుమతీకూడా పెచ్చు పెరిగింది. ప్రభుత్వాలు ఉద్యోగీయవర్గాన్నీ— సైనికబలాన్నీ— పెంచుకొని, తిరిగి వలసరాజ్యాల పంపకం కోసం ప్రపంచయుద్ధం ఆరంభించడానికి ప్రయత్నాలుప్రారంభించేయి. ఇన్నిబాధలకి కారణం అయిన ఈ 'ఇజారా' పద్ధతిని మొత్తంమీద విమర్శించడానికి పూనుకోక దానిలో ఏదో ఒక భాగాన్నిమాత్రం (ఎగుమతి పన్నులపద్ధతినో—ఆయుధసమీకరణానో— వలసనీతినో—యుద్ధనీతినోమాత్రం) విమర్శించబోవడమో, లేక 'ఇజారా' పద్ధతి ఇంతకంటె ఉత్తమమైననీతిని అవలంబించాలనడమో వట్టి వెఱ్ఱిబాగులతనం. సింహాన్ని గడ్డితిని బ్రదుకమనడం ఎంతప్రయోజనకారియో ఇదీ అలాగంటిదే.

"ఇజారా" పద్ధతి అంటే? పెట్టుబడిదారీవిధానముయొక్క ఉపజీవికావస్థతప్ప మరేమీ కాదు. ఈదశలో ప్రపంచంలో అధికభాగం బలవంతాలయిన ప్రభుత్వాలకి తనఖా అయిపోతుంది. ప్రపంచ ప్రజలలో అధికభాగం కొద్దిమంది పెట్టుబడిదారుల చేతికి అమ్ముడుబోతారు. సామ్రాజ్యవాద దేశాలలో ఉత్పత్తి విధానంలో ఏమాత్రమూ పాల్గొనక కేవలం లాభాలమీదనే జీవించే పెట్టుబడిదారులు ఎక్కువ అవుతారు. వారి దయాదాక్షిణ్యాలమీద జీవించే ప్రజల సంఖ్య విపరీతంగా పెరిగిపోతుంది. ఉత్పత్తిలో పాల్గొనే జనం క్రమంగా తగ్గిపోతారు.

ఆదేసమయంలో తమకు చిక్కుతూన్న అధికలాభాలలో కొంత భాగం ఖర్చుపెట్టి సామ్రాజ్యవాదదేశాలలో కార్మికవర్గంలోని పై అంతరువువారినీ, నాయకుల్నీ, ఏవేవో కొద్దిసౌకర్యాల నిచ్చీ, లంచాలనిచ్చీ, కొనివేస్తారు. అందుచేత వారినాయకులు ఎప్పుడూ పెట్టుబడిదారులతోనే సహకారంగా వుంటారు. "బూర్జువాకార్మికసంఘాలు" ఈ విధంగానే ఏర్పడతాయి. శ్రామికవర్గనాయకులలో నిరంకుశలక్షణాలు ప్రబలుతాయి. యూరపు—అమెరికాలలోని శ్రామికవర్గోద్యమంలో పెచ్చుపెరిగిన ఒడుగుబాటువవానికికీ—సంస్కారవాదానికీ, ఇదే మూలకారణం. దీనివలననే కార్మికోద్యమంలో విభేదాలు కలిగినాయి.

"ఇజారా" పద్ధతి పెట్టుబడిదారీవిధానంయొక్క చరమదశయే. ఈ పద్ధతి ఆ విధానంయొక్క పరకష్టోపజీవనాన్ని బయట పెడుతూంది. పెట్టుబడిదారీవిధానంలో ఉత్పత్తి ఎంతవరకు హెచ్చేటందుకు అవకాశాలున్నాయో అంతవరకు హెచ్చిపోయింది. ఇంక అది అభివృద్ధి పొందలేదు. "ఇజారా" పద్ధతిలో దానికి కృత్రిమపుహద్దులు ఏర్పడిపోయేయి. ఉత్పత్తి విధానానికీ— పెట్టుబడిదారీవిధానానికీ— వైరుధ్యాలు ఏర్పడ్డాయి.

ప్రపంచయుద్ధం ఆరంభం అయి ఈవైరుధ్యా లన్నిటినీ ప్రదర్శింపించింది. కార్మికవర్గవిప్లవం ఆరంభం కావడానికి తగిన అదను ఇదే.

## మనం పూర్తిచేయవలసిన ప్రధాన కర్తవ్యం : ప్రపంచ విప్లవం.

"మనం పూర్తిచేయవలసిన ప్రధానకర్తవ్యం" అనే కరపత్రంలో "లెనిన్" దానిని గురించి ఈలాగవ్రాసేడు. (1918 మార్చి 14 న ఇది "ఇజ్వెస్టియా" పత్రికలో ప్రకటించబడింది. దానినే తరువాత కరపత్రంరూపంలో ప్రకటించేరు.)

"మానవజాతి అతికఠినములైన గొప్పమార్పులు పొందుతూ సాగిపోతూంది. (ఇందులో ఏమాత్రమూ అతిశయోక్తి లేదు.) ఈమార్పులు

ప్రపంచానికి స్వాతంత్ర్యాన్ని ఈయగలవు. పీడితులు తమరిని పీడించే వారితో యుద్ధం జరిపేరోజులు దగ్గిర పడుతూన్నాయి. ఈ నూతన యుద్ధంలో పీడితవర్గాలు పెట్టుబడిదారీవిధానము పెట్టే బాధలనుతప్పించుకొని స్వాతంత్ర్యం పొందేటందుకు ప్రయత్నిస్తాయి. బాధ-పీడనము-పశుత్వముల బారినుండి తప్పించుకొని కమ్యూనిస్టుసమాజము ఈయగల సుఖాల ననుభవించాలని వారి యాశ. ప్రజలందరూ సుఖం పొందగల చోటికి-శాంతి లభించే ప్రదేశానికి నడిచిపోవాలని వారి ఊహ."

ఇంకో చోటకూడా ఈవిషయాన్నే స్పష్టం చేసేడు.

"సోషలిజంలో గాక మరెక్కడా మానవజాతికి ఈయుద్ధాలనుంచి, ఈ ఆకలిబాధనుంచి, లక్షలు-కోట్లు ప్రజల నాశనాన్నుంచి నిష్కృతి పొందేటందుకు అవకాశం లేదు."

(In Louis Blanc's foot-steps. Pravada-21st, April 1917.)

ప్రపంచవిప్లవం ఏనాడో వస్తుందని కలలు కంటూ కూర్చోక, అది మనకి తప్పించుకొనరాని శీఘ్రకర్తవ్యంగా ఎంచాలని బోధించడమే "లెనిన్" ఉపదేశాలలోగల ప్రధానవిషయం. మరణశయ్యమీద వుంది పెట్టుబడిదారీతత్వం. ఈఆఖరుదశలో విప్లవానికి కావలసిన పరికరాలన్నీ సంసిద్ధంగా వున్నాయి. ఆ విప్లవాన్ని నడిపించవలసిన ప్రపంచశ్రామిక వర్గం చైతన్యం పొంది, పరిస్థితుల్ని అవగాహన చేసుకొని, కార్యక్రమంలోకి దిగాలని "లెనిన్" మాటిమాటికి చెప్పేడు. ఆలస్యం చేసిన కొలదీ రోజురోజుకి బాధలు-ఆకలి-దౌర్జన్యాలు-ప్రజామారణం పెరిగిపోతాయే గాని తగ్గవని చెప్పేడు. 1914 తర్వాత గడిచిపోయిన రెండు దశలకాలమూ ఈ విషయంలోని యాథార్థ్యాన్ని నిరూపించేయి. విప్లవం ఆలస్యం అయినకొద్దీ సామ్రాజ్యవాదులు క్రమక్రమంగా పెరిగిపోతూవున్న ఆర్థికసంక్షోభాలు కారణంగా నూతనప్రపంచయుద్ధానికి దారి తీస్తున్నారు.

"లెనిన్" ఆకాలంనాటి సమస్యలకి—ప్రపంచవిప్లవానికి—సజీవము దృఢము—నిర్దిష్టమునైన విధానంలో వ్యాఖ్యానం వ్రాసేడు. ఏ అర్థరాత్రి

వేళనో కొద్దిపాటి పోరాటాలు జరిగించేస్తే ప్రభుత్వాధికారం కార్మికుల చేతికి వస్తుందని ఆతడెన్నడూ ఊహించలేదు. ఆలాగని ఆ పని జరగ డానికి యుగాలకి యుగాలు జరిగిపోతాయనీ అతడు తలపోయలేదు. కొద్దిదశలపాటు ప్రయత్నాలు సాగిస్తే ప్రపంచవిప్లవం సాధించబడు తుందని "లెనిన్" దృఢంగా చెప్పేడు. 1851 లో "కొలోన్‌లో జరుప బడ్డ కమ్యూనిస్టువిచారణను గూర్చిన ప్రకటన" లో మార్క్సు వ్రాసినది చూడండి.

"మీరంతా పదిహేను-ఇరవై-ఏభై-ఏళ్ళవరకూ కూడా అంతర్యుద్ధాలు, అంత ర్జాతీయయుద్ధాలు సాగించవలసియుంటుంది. ఇంతప్రయత్నమూ కేవలం సామాజిక నిబంధనల్ని మార్చడంకోసమేకాదు. ఈప్రయత్నాలలో మీరు కూడా మారిపోవాలి. రాజ్యాంగాధికారం నడిపించడానికి తగిన సామర్థ్యం గలవారు కావాలి."

అదేవిధంగా లెనిన్‌కూడా చెప్పేడు.

"పెట్టుబడిదారీ తత్వంనుంచి సోషలిజంలోనికి మారాలంటే ఒక చారిత్రక శకం అంతా పడుతుంది." (Proletarian Revolution ప్ర. 3.)

ఈ విషయాన్ని ఒకచోట ఇంతకంటేనూ కూడా వివరంగా వ్రాసేడు.

"అభివృద్ధిచెందిన దేశాలలో, అక్కడి బూర్జువావర్గంతో శ్రామికులు జరిపే అంతర్యుద్ధంతో; అప్పుడప్పుడే అభివృద్ధిచెందుతూన్న దేశాలలోని ప్రజాతంత్రపోరా టాన్ని, వెనుకబడియున్న దేశాలలోని విప్లవోద్యమాన్ని, పరాధీనదేశాలలోని జాతీ య స్వాతంత్ర్యపోరాటాన్ని, అనుబంధింపచేయగల్గిన శకంలోనే సోషలిస్టువిప్లవం వస్తుంది. మరొకలాగ రావడం అసంభవం. ఎందుచేత? పెట్టుబడిదారీతత్వం అన్ని చోట్లా ఒకేవిధంగా అభివృద్ధి పొందదు."

(On a Caricature of Marxism and Imperialist Economism 1916.)

ప్రపంచవిప్లవంయొక్క స్వభావాన్నీ, అభివృద్ధినీ, తెలుపగల కీలకాన్ని "లెనిన్" ఇక్కడ స్పష్టం చేసేడు. మార్క్సు అస్పష్టంగా "పదిహేను—ఇరవై—ఏభై—ఏళ్ళపాటు అంతర్యుద్ధాలు, అంతర్జాతీయ యుద్ధాలు" జరపాలన్నాడు. ఆ పోరాటం జరపవలసిన దెంతకాలమో

"లెనిన్" స్పష్టంగా చెప్పేసేడు. "సామ్రాజ్యవాదం" అంటే ఏమిటో స్పష్టంగా విడబరచి తెలుసుకోగలగడం చేతనే అతనికి ఈలాగ చెప్పగలశక్తి కలిగింది. ప్రపంచవిప్లవక్రమానికీ, పెట్టుబడిదారీతత్వంయొక్క అభివృద్ధిలోని హెచ్చుతగ్గులకీ, ప్రత్యక్షసంబంధం వుంది. మార్క్సిజానికి పెడర్థాలుతీసిన రెండవ ఇంటర్నేషనలులోని వారికి—ఏదేశానికి ఆ దేశమే ప్రత్యేకంగా—ఒకేమాదిరి పరిణామాన్ని పొందుతుందనీ, పెట్టుబడిదారీ విధానంలోనుంచి "ఇజారా" పద్ధతిలోనికీ, దానిలోనుంచి సోషలిజంలోనికి క్రమాభివృద్ధి కలుగుతుందనీ, ఒక అభిప్రాయంవుంది. (ఇది మార్క్సిజం పేరిట పెట్టుబడిదారీతత్వానికి లొంగిపోవడం తప్ప వేరుకాదు.) పై అభిప్రాయాలకి కేవలం వ్యతిరేకంగా ప్రపంచంలోని పెట్టుబడిదారీవిధానం దశాభేదం వున్నా అదంతా ఒక్కటే చక్రం అనీ, దానిలోని పరస్పర విరుద్ధసమస్యలు క్రమంగా నైశిత్యం పొంది, ఆ చక్రంలో అపుకుగా, దుర్బలంగా, వున్నచోట బ్రద్దలై విప్లవం బయలు దేరుతుందనీ, "లెనిన్" చెప్పేడు.

సామ్రాజ్యవాదం ప్రపంచాన్నంతనీ దగ్గరగా ఒకేఒక సమ్మేళనము లోనికి తెచ్చింది. దీనిఅర్థం—ప్రపంచంలోని మార్కెట్లనన్నింటినీ ఒకే పద్ధతిమీద నడిచేలాగ చేయడం అని కాదు. పరాధీనత—బానిసత్వముల యొక్క వేరువేరుదశలలో నలిగిపోతూన్న వలసరాజ్యాలు—ఋణగ్రస్త దేశాలు—పరాజితదేశాలు—మొదలయినవానిని కాలిక్రింద అణచిపెట్టి కొద్దిపాటి ధనికసామ్రాజ్యాలు తమలోతాము పోరాడుకుంటూ, తరుచుగా బలాబలాలు కోల్పోతూ అధికారం వహించి నిలువబడి యున్నాయి. అందుచేతనే నేడు స్వాతంత్ర్యం కోసం జరుపబడుతూన్న పోరాటాలన్నీ ఒక్కటేననీ, వానిని ఏవో కృత్రిమములయిన హద్దులలో చేర్చి విడతీయ రాదనీ, చెప్పడం. పెట్టుబడిదారీతత్వంతోగల వైరుధ్యాలన్నీ సామ్రాజ్య వాదదశలో పరాకాష్ఠని పొందేయి. ప్రధానములయిన సామ్రాజ్యవాద దేశాలలో బూర్జువావర్గంతో శ్రామికవర్గం నడుపుతూన్న పోరాటం

ఒకటి; సామ్రాజ్యవాదప్రభుత్వముయొక్క అధికారాన్ని తొలగించు కుందుకు వలసరాజ్యాల ప్రజలు సాగిస్తూన్న స్వాతంత్ర్యయుద్ధం ఒకటి; సామ్రాజ్యవాద దేశాలమధ్యనేగల పరస్పరసంఘర్షణం, ఒకటి; ప్రపంచ యుద్ధానంతరం, కొత్తగా బయలుదేరిన శ్రామికవర్గప్రభుత్వమైన సోవియటుయూనియనుతో సామ్రాజ్యవాదప్రభుత్వాలు పెట్టుకుంటూన్న సంఘర్షణం, ఒకటి; ఇవన్నీ తీవ్రరూపం ధరించేయి. ఈసంఘర్షణము లన్నింటి యొక్క అభివృద్ధీ ప్రపంచవిప్లవాభివృద్ధి. అందుచేతనే "సామ్రాజ్యవాదదశయే సోషలిస్టు విప్లవోద్యమ సమయం" అన్నాడు "లెనిన్."

దోపిడీ చేయబడుతూన్న ప్రజలు చేసేపోరాటాలను ప్రతిదేశం లోను కార్మికవర్గం నడిపిస్తూన్నట్లే, ప్రపంచం మొత్తంమీద వలసదేశాల ప్రజలు "స్వాతంత్ర్యం" సంపాదించేటందుకు సామ్రాజ్యవాదంతో జరిపే పోరాటాన్ని, అంతర్జాతీయ కార్మికవర్గం నాయకత్వం వహించి నడిపిస్తూంది. ప్రధానములైన సామ్రాజ్యవాద దేశాలలోని కార్మికవర్గమూ, స్వాతంత్ర్యసంపాదనకోసం పోరాటం సాగిస్తూన్న వలసరాజ్యాలప్రజలు కలిసినప్పుడే సామ్రాజ్యవాద విధానాన్ని కూలద్రోయడంలో విజయం పొందగలరు. ఈ పని నెరవేరాలంటే కొన్నిఏళ్ళు పడుతుంది. ప్రపంచంలోని వివిధప్రదేశాలలో వేరువేరుగా ఎన్నో పోరాటాలు సాగుతాయి. సామ్రాజ్యవాదయుద్ధాలు, అంతర్యుద్ధాలు, ఎన్నో నడుస్తాయి. జయాలు—అపజయాలు, తటస్థపడతాయి. వీనివలన సోషలిస్టు విప్లవంయొక్క పునాదులు గట్టిపడి ఆఖరుకి ప్రపంచవిప్లవం విజయవంతం అవుతుంది.

## శ్రామికవర్గ నియంతృత్వం.

ఈ శకంలో సాగించవలసిన ప్రధానకర్తవ్యం "ప్రపంచవిప్లవమే" నని "లెనిన్" తరుచుగా బోధించేడు. ఈ ఉపదేశాన్ని కార్యరూపంలోనికి తెస్తే—వచ్చే—ఫలితమే శ్రామికవర్గనియంతృత్వం.

సోషలిజంలోనికి పరిణామం పొందేటందుకు ముందు ఈశ్రామిక వర్గనియంతృత్వం అత్యవసరమైన మెట్టు అనే సిద్ధాంతాన్ని "మార్క్సు"

తనరచనలో ఆదినుంచి అంతంవరకూ మాటిమాటికీ ఒత్తిచెప్పుతూ వచ్చేడు. మార్క్సుయొక్క ఉపదేశాలన్నిటికి సారభూతమైన ఈసిద్ధాంతాన్ని "లెనిన్" అనుభవంలోకి తెచ్చి నూతనం జీవం పోసేడు. బూర్జువాపార్లమెంటరీపద్ధతికి ముగ్ధులైపోయిన రెండవ"ఇంటర్నేషనలు" నాయకులు శ్రామికవర్గనియంతృత్వాన్నిగూర్చి మార్క్సుఏంగిల్సులుచేసిన ఉపదేశాల నన్నింటినీ వారు మరణించగానే మరిచిపోయేరు. ఆఖరు పోరాటం తప్పనిసరిగా జరిగితీరవలసిందే. ఆ పోరాటంకూడా అంత ర్యుద్ధరూపంలోనే వచ్చి తీరుతుంది. ఈ పోరాటంకోసమై తమశక్తుల్ని కూర్చుకొనేటందుకు మాత్రమే శ్రామికులు "పార్లమెంటరీవిధానాన్నీ—సార్వజనికమైన వోటింగుపద్ధతినీ, వినియోగించుకోవలసి యుంటుందని మార్క్సు—ఏంగిల్సులు బోధించేరు. కాని, రెండవ "ఇంటర్నేషనలు" నాయకులు అంతస్సారములేని ఈ పార్లమెంటరీపద్ధతులలోనే నిజమైన శక్తి వుందని తలచి, పెట్టుబడిదారీతత్వం యొక్క అధికారంక్రింద కూడా "స్వచ్ఛమైన ప్రజాతంత్రపద్ధతులకి" అవకాశం వుందనీ, బూర్జువా పార్లమెంట్లద్వారా శ్రామికవర్గం "ప్రభుత్వాధికారాన్ని" స్వాధీనం చేసుకోవడానికి అవకాశాలున్నాయనీ, వీరంతా మార్క్సిజానికి వ్యతిరేకంగా వుండే సిద్ధాంతాలను బోధించసాగేరు. ఈ నాయకులంతా శ్రామికవర్గానికి విరుద్ధంగా యుద్ధంరోజులలో పెట్టుబడిదారీప్రభుత్వాలకీ, యుద్ధానంతరం ఫాసిజానికీ, లొంగిపోయినప్పుడు వారంతా "సోషలిజానికి ప్రజాతంత్ర పద్ధతులద్వారా తీసుకుపోతుందని" చెప్పిన ఈమార్గయొక్క నిజస్వభావము స్పష్టంగా తెలిసిపోయింది.

శ్రామికవర్గనియంతృత్వంకోసం విప్లవం సాగించాలని మార్క్సు చెప్పేడు. బూర్జువాడెమాక్రసీలోగల బండారాన్ని బయటపెడుతూ లెనిన్ కూడా ఆ మాటనే రెట్టించేడు.

"ఈ బూర్జువాడెమాక్రటిక్ రిపబ్లిక్కు కొద్దిమంది పెట్టుబడిదారులు కష్టజీవులయిన ప్రజల్నీ, బూర్జువావర్గము శ్రామికవర్గాన్ని అణచిపెట్టడంకోసమై ఉపయో

గించే సాధనంమాత్రమే యని మార్క్సు-ఏంగిల్సులు చెప్పినది చాలా శాస్త్రీయము-పబఋ కూడాను."

(బూర్జువా ప్రజాతంత్రము: శ్రామికవర్గనియంతృత్వము. 1919.)

"బూర్జువాడెమాక్రసీని, భూస్వామ్యపద్ధతితో పోల్చిచూస్తే చారిత్రకంగా అది అభివృద్ధికరమేనని తేలుతుంది. అయితేనేం? నిజానికి అది ధనికులకుమాత్రమే స్వర్గతుల్యం. దోచుకోబడుతూన్న బీదవారికది బందిఖానా. భ్రమోత్పాదకము-సంకుచితములైన కపటసంస్థ మాత్రమే. అంతకంటె మంచిదనం దాంట్లో ఆశించడం కూడా వ్యర్థం."

(శ్రామికవర్గ విప్లవం. ప్ర. 2.)

బూర్జువాడెమాక్రసీలో కార్మికులకిగలదని చెప్పే "స్వాతంత్ర్యం" వట్టిబూటకం అనీ, అందులో నున్నది. పెద్దపెద్దపెట్టుబడిదారుల నియంతృత్వాధికారమేననీ, బ్రిటను-ఫ్రాన్సు-అమెరికాల ప్రభుత్వవిధానాలలోనుంచి ఎన్నో ఉదాహరణల చూపి నిరూపించేడు.

రాజ్యాంగయంత్రం అంటే పాలకవర్గంయొక్క కార్యనిర్వాహక సమితిమాత్రమేనని మార్క్సు చెప్పేడు. పెట్టుబడిదారీతత్వంక్రింద నున్న రాజ్యాంగయంత్రం పెట్టుబడిదారీవర్గ నియంతృత్వాన్నే నిర్వహిస్తుంది. శ్రామికవర్గనియంతృత్వమే దానికి తగిన ప్రతి.

"పెట్టుబడిదారీసమాజంలో పెట్టుబడిదారీవర్గముయొక్క నియంతృత్వమేనా సాగాలి. శ్రామికవర్గనియంతృత్వమేనా సాగాలి. ఇంక మరో మధ్యమార్గం లేనే లేదు. ఏదోవుందని కలలు కనడం మధ్యతరగతుల ప్రజల విప్లవనిరోధకతత్త్వం యొక్క ఫలితంతప్ప మరొకటి కాదు."

(బూర్జువాప్రజాతంత్రము శ్రామికవర్గనియంతృత్వము. 1919.)

పెట్టుబడిదారుల రాజ్యాంగయంత్రాన్ని కూలద్రోసి, దానిస్థానే ఏర్పడిన శ్రామికప్రభుత్వసంస్థలయిన సోవియట్లు-లేక-ప్రతినిధిసభల ద్వారా శ్రామికవర్గాన్ని పాలకవర్గంగా చేయడంతోటే ఈ శ్రామికవర్గ నియంతృత్వం కార్యరూపం ధరిస్తుంది. ఆవిధంగా, ఒకనూతన ప్రజాతంత్రం— సోవియటుప్రజాతంత్రం— శ్రామికవర్గప్రజాతంత్రం— అమలు

లోనికి వచ్చింది. ప్రభుత్వనిర్వహణంలోను—చట్టనిర్మాణంలోను—వానిని అమలులో పెట్టడంలోను ప్రజాసామాన్యం ప్రత్యక్షంగా పాల్గొనేటట్లు చేయడంచేత శ్రామికవర్గ ప్రజాతంత్రంలోనే బూర్జువాప్రజాతంత్ర పద్ధతి లోకన్న ఎక్కువ ప్రజాప్రాతినిధ్యం వుందని "లెనిన్" ఎప్పుడూ ఒత్తి చెప్పుతూ వుండేవాడు.

"లెనిన్" యొక్క శత్రువులూ, బూర్జువావిధానాన్ని సమర్థించే యదార్థజ్ఞానశూన్యులూ, చెప్పేటట్లు "లెనిన్" ప్రజాతంత్రపద్ధతులకి వ్యతిరేకి కాదు. అతడు సంపూర్ణమైన ప్రజాతంత్రవిధానాన్ని మనస్ఫూర్తిగా కోరుతాడు. కనకనే, నేతిబీరకాయవంటి బూర్జువాప్రజాతంత్రాన్ని అంత ఎక్కువగా అసహ్యించుకొని, ఎదిరించేడు. వర్గభేదాన్ని నశింపచేసి యదార్థము—సంపూర్ణములైన స్వేచ్ఛనూ—సమానత్వాన్నీ ప్రసాదించే వర్గరహితసమాజాన్ని ఒక్క శ్రామికవర్గప్రజాతంత్రవిధానమే నిర్మించగల గడంచేత అదే అత్యుత్తమమైన "ప్రజాతంత్రపద్ధతి" అని నిర్ణయించి దానికోసం పోరాడేడు.

అల్పసంఖ్యాకులయిన దోపిడీగాండ్రను అణచిపెట్టేటందుకు అధిక సంఖ్యాకులయిన ప్రజాసామాన్యం నియంతృత్వం వహించడమే శ్రామిక వర్గనియంతృత్వం, వర్గకలహాన్ని ముగింపుకు తీసుకొనిపోయి పురాతన సామాజికవిధానాన్ని నాశనంచేసి, నూతనసమాజాన్ని నిర్మించడానికిగల ఏకమాత్రసాధనం అదే.

"పురాతనసమాజముయొక్క ఆచారాలనీ-శక్తులనీ ధ్వంసం చేయడానికై రక్తపాతం గావించి-రక్తపాతం చేయకుండానూ; దౌర్జన్యయుతంగాను - శాంతంగానూ; ఆర్థికంగాను-సైనికంగానూ; వైజ్ఞానికంగాను, రాజకీయంగానూ; దృఢదీక్షతో, నిరంతరాయంగా, జరిపే పోరాటమే శ్రామికవర్గనియంతృత్వం."

(Left communism. ప్ర. 5.)

కాని, శ్రామికవర్గనియంతృత్వం అనేది ఒక్క మెట్టుమాత్రమే. బూర్జువావర్గముయొక్క ప్రతిఘటనలు అంతరించి, వర్గభేదాలు, నశించ

గానే, దీనికర్తవ్యం పూర్తి అయిపోతుంది. ఒకరిని పీడించేటందుకే ఉపయోగించబడే రాజ్యాంగయంత్రం అంతర్ధానమైపోయి కమ్యూనిస్టు సమాజానికి తావు ఇస్తుంది. ఈ సమాజంలో మానవులందరికీ ఆర్థిక–సామాజిక పరిపాలనాధికారంలోను, వైజ్ఞానిక జీవితంలోను, కూడా సమానమైన అనుభవం ఏర్పడుతుంది.

"రాజ్యాంగయంత్రంయొక్క అధికారాన్ని నాశనం చేయడమే సోషలిస్టు లందరియొక్క గమ్యం. వారందరిలోకీ ప్రప్రథమంలో ఈవిషయాన్ని నొక్కి చెప్పినవాడు మార్క్సు. ఈకర్తవ్యం పూర్తికానిదే నిజమైన ప్రజాతంత్రవిధానం అంటే స్వాతంత్ర్యం-సమానత్వం-అనేవి సాధ్యపడవు. దీనిని సాధించగలదిఒక్క సోవియటు-లేక-శ్రామికవర్గ- ప్రజాతంత్రం మాత్రమే. ఈవిధానం ప్రారంభంనుంచీ రాజ్యాంగయంత్రాన్ని శుష్కింపచేయడంకోసమే కష్టజీవులయిన ప్రజలు తమ సంస్థలద్వారా బహిరంగంగా రాజ్యాంగ యంత్రనిర్వహణంలో పాల్గొనేటట్లు చేస్తుంది."

(బూర్జువాప్రజాతంత్రము: శ్రామికవర్గ నియంతృత్వము. 1919.)

## జాతీయస్వాతంత్ర్యం: వలసరాజ్యాల దాస్యవిముక్తి.

ప్రధానములయిన సామ్రాజ్యవాదదేశాలలో శ్రామికవర్గంయొక్క పోరాటంతో అర్ధాధీన–పరాధీనదేశాల ప్రజలయొక్క స్వాతంత్ర్యపోరాటాన్ని జతచేయడమే ప్రపంచవిప్లవం విజయం పొందడానికి అనుసరించవలసిన ముఖ్యసూత్రం అని "లెనిన్" మాటమాటకు ఒత్తిచెప్పేడు.

కార్మికోద్యమానికీ–ప్రపంచవిప్లవానికీ జాతీయస్వాతంత్ర్యసమస్య ఎంత ముఖ్యమైనదో పోలండును–ఐర్లండును గూర్చి వ్రాసేటప్పుడు మార్క్సు ప్రత్యేకంగా వ్రాసేడు.

సామ్రాజ్యవాదశకంలో ఈ సమస్యకి మరీ ప్రాముఖ్యత కలిగింది. మానవజాతిలో అధికభాగం పరాధీనులుగాను, తత్సమానులుగాను, తయారయ్యేరు. ఈ ప్రజల్ని దోచుకొనడంమీదనే బూర్జువావర్గంయొక్క బలం ఆధారపడివుంది. అందుచేతనే వలసరాజ్యాల ప్రజలు నడిపించే

స్వాతంత్ర్యపోరాటంలో సహకారం చేసినప్పుడే సామ్రాజ్యవాదదేశాల లోని శ్రామికులు విముక్తి పొందగలరు.

వెనుకటి—రెండవ—ఇంటర్నేషనల్ నాయకులెవ్వరూ ఈ సమస్య యొక్క ప్రాముఖ్యతని గుర్తింపలేక పోయేరు. పార్టీకార్యనిర్వాహక వర్గాలలోని నాయకులంతా "జాతీయస్వాతంత్ర్యం"—"స్వపరిపాలన"— మొదలగువానికి అనుకూలంగా తీర్మానాలు తయారు చేసేవారు. కాని, క్రియలో సామ్రాజ్యవాదప్రభుత్వంతోనే సహకారంచేస్తూ, స్వాతంత్ర్య విప్లవానికి ఏమాత్రపు సానుభూతికూడా చూపేవారేకాదు. వీరిలోనే ఇంకో కక్షివారు "జాతీయస్వాతంత్ర్యం" బూర్జువావర్గానికే ఉపయోగిస్తుందనీ. సోషలిస్టులకు దానిలో ప్రయోజనం ఏమాత్రమూ లేదనీ, కనుక కార్మిక వర్గం దానిలో పాల్గొవలసిన పనిలేదనీ వాదించసాగేరు. పెద్దపెద్ద ఆర్థిక సమ్మేళనాలను విచ్ఛిన్నం చేయడం సోషలిష్టుల సిద్ధాంతాలకే వ్యతిరేకం అని వీరి యూహ. (ఈ సిద్ధాంతానికే "సామ్రాజ్యవాదార్థిక తత్వం"— 'Imperialist Economism' అంటూ "లెనిన్" నామకరణం చేసేడు.) ఈ ఉభయపక్షాలూకూడా కార్యాచరణలో సామ్రాజ్యవాదానికే సహాయ భూతము లైనాయి.

విప్లవరంగంలో ఈ సమస్యకుగల ప్రాముఖ్యతని సామ్రాజ్యవాద శకంలో మొట్టమొదట గుర్తించినవాడు లెనినే. ఏషియాలో పోరాటాలు సాగిస్తూన్నవిప్లవశక్తులు దినదినాభివృద్ధి పొందుతూవుండడాన్ని ప్రపంచ యుద్ధానికి ముందే అతడు గుర్తించేడు. ఈవిషయంమీదనే 1913 లో అతడు "వెనుకబడియున్న యూరపు ముందుకు పోతూన్న ఏషియా" అంటూ ఒకవ్యాసంవ్రాసేడు. ప్రపంచయుద్ధం జరుగుతూన్న రోజులలోనే ఈసమస్యలోని ప్రతిచిన్నవిషయాన్నీ సంపూర్ణంగా విమర్శించి"జాతీయ స్వయంనిర్ణయాధికారం" అనే హెచ్చరికకి విప్లవరంగంలో గల ప్రాధాన్యతను స్పష్టంగాచూపించేడు. 1916 లో "ఐరిషు" తిరుగుబాటును నిందించినవారిని ఖండిస్తూ అతడు అది విప్లవమే కాని మరొకటికాదని వ్రాసేడు.

"యూరపుఖండంలోని "మైనారిటీ" జాతులు, వలసరాజ్యాలప్రజలు, తిరుగుబాటు చేయాలి. మనసులో ఎంత ఇష్టంలేకపోయినా మధ్యతరగతుల ప్రజలు విప్లవంలో చేరాలి. వర్గచైతన్యంలేని కూలీలు, తత్సమానులయిన పీడిత ప్రజాసామాన్యము — భూస్వాములయొక్క, రాజులయొక్క, మతపీఠాలయొక్క, విజాతీయులయొక్క, ఒత్తిడిని తప్పించుకొనడానికి విప్లవోద్యమం ఆరంభించాలి. ఇదేమీ లేకుండానే సామాజిక విప్లవం రావడానికి అవకాశం వుందనుకోవడం అసలు సామాజికవిప్లవమే లేదని చెప్పడం వంటిదే.........

"స్వచ్ఛమైనసామాజిక విప్లవాన్ని చూద్దామనుకొనే వారెవ్వరైనా వుంటే అది వారు బ్రతికియుండగా చూడలేరనే విషయం గ్రహింపవలసినదే. ఆలాగ చెప్పేవ్యక్తి మాటలలోనే విప్లవం ప్రదర్శించగలుగుతాడు. కాని ఆతనికి విప్లవం అంటే ఏమిటోకూడా అర్థం కాదనే అనుకోవాలి."

("స్వయంనిర్ణయ" సిద్ధాంత చర్చాఫలితాలు 1916.)

సోవియటువిప్లవం విజయం పొందిన తరువాత ఈ ప్రశ్నకి మరింత ప్రాముఖ్యత కలిగింది.

"ప్రపంచవిప్లవశకం ఆరంభం కాకముందు జాతీయస్వాతంత్ర్యోద్యమాలు సాధారణమైన "ప్రజాతంత్రవిప్లవోద్యమం" లో ఒకభాగంగానే వుండేవి. కాని, నేడు రష్యాలో సోవియటువిప్లవం విజయంపొంది ప్రపంచవిప్లవశకం ఆరంభం అయిన వెనుక "జాతీయస్వాతంత్ర్యోద్యమాలు" ప్రపంచశ్రామికవిప్లవోద్యమానికి ఒకభాగముగా ఏర్పడినాయి."

1920 లో కమ్యూనిస్టుఇంటర్నేషనలుయొక్క రెండవ కాంగ్రెసులో "లెనిను"— "జాతీయస్వాతంత్ర్యసమస్య"నీ, "వలసరాజ్యవిముక్తి సమస్య"నీ—చర్చకుతెచ్చి సామ్రాజ్యవాదదేశాలలోని కార్మికవర్గం ఆఉద్యమాలకి సంపూర్ణంగా సహాయం చేయవలసిన అవసరం వుందనిచెప్పేడు. అతడు తాను తయారుచేసిన "థీసిసు" లో ఈవిధంగా చాటేడు.

"పెట్టుబడిదారీతత్వాన్ని నాశనం చేయడంకోసం అన్నిజాతులకీ-అన్నిదేశాలకీ సంబంధించిన కార్మికుల్నీ-శ్రామిక ప్రజాసామాన్యాన్నీ-ఏకంచేసి విప్లవపోరాటానికి నడిపించడమే కమ్యూనిస్టు ఇంటర్నేషనలు "జాతీయ-దేశీయస్వాతంత్ర్యోద్యమాల" విషయమై నిర్వహించవలసిన ప్రధానకర్తవ్యం. ఇది జరగకపోతే జాతులమధ్యగల అసమానత-పీడనము, తొలగిపోవు."

కాని, ఇక్కడ మనం గుర్తించవలసిన విషయం ఒకటి వుంది. పరాధీనజాతులు పూర్తిగా విడిపడడానికి పోరాటం సాగిస్తూన్నాయంటే-ప్రపంచాన్నంతనీ చిన్నచిన్న ముక్కలుగా విభజించేటందుకోసం కాదు. ఒకరితో ఒకరికి సంబంధం లేకుండా చేసుకుందుకు కాదు. "సంపూర్ణంగా విడిపోవడం" అంటే—జాతీయదాస్యాన్ని తొలగించుకొనడం, ఆవిధంగా స్వతంత్రజాతులన్నీ స్వేచ్ఛగా కలసిమెలసి యుండడానికి అవకాశం కలిగించడమూ అన్నమాట. అంటే—మనపరమాదర్శం "ప్రపంచైక్యత"—"అంతర్జాతీయసమ్మేళనము."

"ఈకోరికకీ— చిన్నచిన్న భాగాలుగా విడదీసికొని, చిన్నచిన్న రాజ్యాలు స్థాపించుకొనాలనే భావనకీ-ఏమాత్రమూ సంబంధము లేదు. అన్నివిషయములయిన జాతీయావమానాలకీ విరుద్ధంగా నడిపించే పోరాటాలలో సహజంగా వచ్చే ఫలితమే "స్వాతంత్ర్యం"...........

చిన్నచిన్న ప్రభుత్వాలక్రిందా అనేకజాతులక్రిందా వేరు చేయబడియున్న మానవజాతిలోని విభజనలను పూర్తిగా రద్దుచేయుడమూ-వారందర్నీ ఒకసమ్మేళనం క్రిందికి తేవడమూ మాత్రమే కాకుండా సంపూర్ణముగా జాతీయభేదాల్ని నశింపచేసి ఏకం చేసివేయడమే సోషలిజం యొక్క ఆదర్శం.

"పీడితవర్గాల నియంతృత్వం అనే సంధిదశద్వారా మానవజాతిలో వర్గభేదం ఏలాగ నశిస్తుందో, ఆలాగే పీడితజాతులయొక్క "సంపూర్ణస్వాతంత్ర్యం" -అంటే, విడిపోవడానికి తగిన అధికారం

సంపాదించడం-అనే సంధిదశద్వారా మానవజాతులన్నీ క్షీరనీరన్యాయంగా కలిసిపోగలవు.

(సోషలిస్టువిప్లవము: జాతులకుగల స్వయంనిర్ణయాధికారం; 1916.)

## విప్లవ నిర్మాణము! ఎత్తుగడలు.

విప్లవనీతిని—నిర్మాణాన్ని—ఎత్తుగడలని గూర్చి లెనిన్ ఎంతో స్పష్టంగా వ్రాసేడు. మార్క్సిజంలోని ఏప్రత్యేకవిషయానికి "లెనిన్" ఇంత నిర్దిష్టంగా—వివరంగా వ్యాఖ్యానం వ్రాసియుండలేదు. మార్క్సు కాలంనాటికి శ్రామికవర్గోద్యమం ఇంకా ప్రాథమికస్థితిలోనే వుండడం చేత ఆ నాడీప్రశ్నలన్నింటినీ వివరంగా చర్చించడానికి వీలులేకపోయింది. 19 వ శతాబ్దంలోని విప్లవాలు, కార్మికోద్యమం ప్రజోద్యమముగా మారేటప్పటి ప్రాథమికావస్థలు ఆధారం చేసుకొని కార్మికోద్యమనీతి—ఎత్తుగడలలో ముఖ్యమైనవానికి మార్క్సు ఒక ఆకృతి గీసేడు, మార్క్సు-ఏంగిల్సుల రచనలనిండాను—జాబులనిండాను, నిర్దిష్టములయిన అనేక సమస్యల్ని గూర్చిన సూచనలున్నాయి. వారి తరువాతవారు ఈసూచనలను చాలవరకు అలక్ష్యంచేసీ—మరచీ—వ్యతిరేకించీ-తమకుకావలసినంత వరకు మాత్రమే తీసుకొని వికృతంచేసి, ధ్వంసంచేసేరు. ఒక్క లెనినే తరువాత కాలక్రమంలో కలిగిన అనుభవాల్ని జాగ్రత్తగా పరిశీలించి ఈసూచనలన్నిటికీ వివరణలు వ్రాసేడు. అంతేకాదు. పెట్టుబడిదారీవిధానంయొక్క, కార్మికోద్యమంయొక్క, అభివృద్ధితోపాటు రంగంలోకి వచ్చిన నూతనసమస్య లెన్నింటికో స్వతంత్రములైన వ్యాఖ్యానాలు వ్రాసేడు. మార్క్సిజంయొక్క విధానాన్నీ—ఎత్తుగడలనీ, మొట్టమొదట్లో ఒక పెద్దశాస్త్రంగా తయారుచేసి అభివృద్ధిలోనికి తెచ్చినవాడు "లెనినే."

విప్లవసిద్ధాంతాలతోపాటు విప్లవాచరణవిధానాన్నికూడా "లెనిన్" బాగా విశదీకరించేడు. ఆందోళననీ-నిర్మాణాన్నీ గురించిన ప్రాథమిక పాఠాలు మొదలు--ప్రభుత్వాధికారాన్ని స్వాధీనపరచుకొని, విప్లవానంత

రం జరపవలసిన నిర్మాణకార్యక్రమం వరకూగల అన్ని దశలలోను ఎదుర్కొనే ప్రశ్నలన్నింటికీ అతడు సంపూర్ణమైన సమాధానాలనిచ్చేడు. వీనిలో అతనియొక్క "గతితార్కికశాస్త్ర" పాండిత్యం బాగా ప్రదర్శింపబడింది. విప్లవపథాన్ని విడువకుండా, విప్లవాదర్శాల్ని చెడగొట్టకుండా, ప్రతిఒక పరిస్థితికీ సమాధానం ఈయడంలో గొప్పనేర్పు ప్రదర్శించేడు. అందుచేతనే "లెనిన్" నాయకత్వంలోగల సారాంశాన్ని సంగ్రహపరచి చెప్పడానికి వీలుచిక్కదు. దానిని అతని జీవితక్రమంలోంచి గ్రహించవలసిందే.

పార్టీనిగూర్చిన భావన—అంటే, కార్మికవర్గానికి ముందుగా నిలచి దారిచూపే చైతన్యయుతము—క్రమశిక్షితమునైన పార్టీయొక్క నిర్మాణమే—ఎత్తుగడలనుగూర్చి, విప్లవనిర్మాణాన్నిగూర్చి, "లెనిన్" బోధించిన బోధనలన్నిటికీ కేంద్రం. మార్క్సుకాలంనాటికంటె లెనిన్‌కాలంనాటికి ఈభావన సంపూర్ణపరిణామాన్ని పొంది, స్పష్టం అయింది. అంతక్రితంకంటె శ్రామికవర్గవిప్లవశకంనాటికి శ్రామికుల విప్లవపక్షం అయిన "కమ్యూనిష్టుపార్టీ" చేయవలసినపనులు, ఎదుర్కొనవలసిన సమస్యలు, బాగా పెరిగిపోయేయి. పార్టీ—"క్రమశిక్షణపొందిన ఒకరాజకీయపక్షంగా వుండాలి. దానిసహాయంతో కార్మికవర్గంలో బాగా చైతన్యం పొందిన కక్షివారు శ్రామికుల్ని — తదితరకష్టజీవుల్ని — నడిపించగలుగుతారు." (కమ్యూనిష్టు ఇంటర్నేషనలుయొక్క రెండవకాంగ్రెసుయొక్క థీసిసు.) పార్టీనిర్మాణాన్నిగూర్చిన భావనయే, నాయకత్వాన్నిగూర్చిన భావన. ఏదో కొద్దిమంది వ్యక్తులయొక్క నాయకత్వంగాక—కార్మికవర్గములోని సుశిక్షితమైన ఒకకక్షియొక్క — చైతన్యంతో కూడుకొన్న విప్లవపక్షంయొక్క—విప్లవానికి ముందు, విప్లవం నడుస్తూన్నపుడు, విప్లవానికి తర్వాతకూడా అగ్రభాగాన నిలచి పోరాటాన్నంతనీ నడిపించే పక్షంయొక్క—నాయకత్వం స్థాపించటమే పార్టీనిర్మాణోద్దేశ్యంలోగల ప్రధానాంశం. శ్రామికశక్తుల్ని ఏకంచేసి పోరాటంలో నడిపించేటందుకై

ఇటువంటి పక్షంయొక్క నాయకత్వం లేకుంటే, సుశిక్షితములు—కేంద్రీకృతములునగు బూర్జువారాజ్యాంగ యంత్రంయొక్క - బూర్జువావర్గము యొక్క సమ్మిశితశక్తుల చేతిలో ఓటమి తప్పదు. అందుచేత విజయాన్ని సంపాదించేటందుకై శ్రామికవర్గం కమ్యూనిస్టుపార్టీని బలపరచవలసి యుంటుంది.

నాయకత్వం విషయంలో చేయవలసిన ఈకర్తవ్యాన్ని నిర్వహించడంకోసం "కమ్యూనిస్టుపార్టీ"—బాగా చైతన్యంపొంది, విప్లవకారులై చురుకుదనం గలిగి, స్వార్థత్యాగులయిన కార్మికుల్ని తనలో చేర్చుకుంటూ; పరిస్థితులకు తగినట్లు, తరుచుగా, సవిమర్శకములయిన మార్పులకి లోనయ్యే, విప్లవసిద్ధాంతాలమీద ఆధారపడియుంటూ; పీడితప్రజాసామాన్యంతోటీ, కష్టజీవులతోటీ, దగ్గరసంబంధాలు ఏర్పరచుకుంటూ—వుండాలి. ఆపార్టీసభ్యులంతా పార్టీనీతిని చర్చించడంలోనూ, సూత్ర నిర్మాణంలోనూ, సంపూర్ణచైతన్యంతో పాల్గొనడానికి అవకాశాలు వుండాలి. ఉన్నతసంఘాలయొక్క ఎన్నికలలోను, వానిని కట్టుబాటులో వుంచడం విషయంలోను, సంపూర్ణంగా ప్రజాతంత్రపద్ధతులనే అవలంబిస్తూ—దానికి కేంద్రీకృతము, బలీయమునైన, క్రమశిక్షణను జోడించాలి. ఈ పనిఅంతా జరగడానికి అనుకూలంగా పార్టీసంస్థలు నిర్మించబడాలి. పారిశ్రామికకార్మికవర్గానికి ముఖ్యస్థానాలయిన ఫ్యాక్టరీలలోని సంఘాల మీదను, ట్రేడ్‌యూనియన్లు మొదలగు ప్రజాసంస్థలమీదను, ఈ పార్టీ ముఖ్యంగా ఆధారపడి యుండాలి.

యుద్ధానికి పూర్వంవున్న రెండవ ఇంటర్నేషనలులోని సోషల్ డెమాక్రాటిక్‌పార్టీలు సాధారణంగా పార్లమెంటరీ పద్ధతులమీదనే ఆధారపడియుండేవి. లెనినుయొక్క పైఅభిప్రాయాలు వెనుకటి పద్ధతులతో పూర్తిగా భేదించాయి. 1914 తర్వాత అతడు సోషల్‌డెమాక్రటిక్‌పార్టీతోగల సంబంధం పూర్తిగా విడదీసుకున్నాడు. "సోషల్‌డెమాక్రటిక్ పార్టీ" అనే పేరులో అర్థం లేదనీ, అది తప్పు అనీ, మార్క్సు—

ఏంగిల్సులు పదేపదే చెప్పుతూండేవారు. ఆ పార్టీలే నేడు పూర్తిగా ద్రోహులతో చేరిపోయినాయి. కనుక లెనిన్ ఆ పార్టీని వదిలిపెట్టి మార్క్సు—ఏంగిల్సులు శాస్త్రీయమైనదని చెప్పుతూ,ఉపయోగిస్తూఉండిన "కమ్యూనిస్టుపార్టీ" అనే పేరునే వాడడం ఆరంభించేడు.

కార్మికవర్గం విజయం పొందగల సామర్థ్యం సంపాదించి, సంసిద్ధం కావాలంటే కార్మికోద్యమం ఎంతోకాలం పోరాటంసాగించాలి. ఎంతో అనుభవం సంపాదించాలి. ఎన్నో చిన్నచిన్న పోరాటాలు చేయాలి. జయాపజయాలకి ఒడిగట్టాలి. తన నిర్మాణాన్ని బలపరచుకోవాలి. వైఖరుల నెన్నింటినో మార్చుకోవాలి. ఈ గతిక్రమంలోంచి బయలుదేరిన కమ్యూనిస్టుపార్టీ సమర్థమైన నాయకత్వం కలదై ప్రజాసామాన్యంలోకి ప్రాకి, అనుకూలమైన తరుణంలో ముందు కురికి, బూర్జువారాజ్యాంగ విధానాన్ని సంపూర్ణంగా విధ్వంసం చేసివేయగలదు. నాయకత్వం వహించుతూన్న కమ్యూనిస్టుపార్టీకి ఈ కర్తవ్యాల్ని నిర్వహించగల సామర్థ్యం మొట్టమొదటిసంఘం ఏర్పడిననాటికే కలుగుతుందన్నమాట అబద్ధం.

నాయకుల్ని-వర్గాన్ని- ప్రజాసామాన్యాన్ని- వేరు చేయడానికి కూడా వీలుకానంత దృఢమైన ఒకేఒక పార్టీగా తయారుచేసే నేర్పు సంపాదిస్తేనేగాని "కార్మిక విప్లవపక్షం" అనిపించుకొనడానికి తగదు.

(Left Communism. ప్ర. 6.)

శ్రామికవర్గసంస్థలలో కమ్యూనిస్టుపార్టీ ఉత్తమము— కడపటిది కూడాను. మొదటిదిమాత్రం కాదు. శ్రామికవర్గపోరాటం పెరిగినకొలదీ, దానియొక్క అభివృద్ధితోపాటు ఈపార్టీకూడా పెరిగి అభివృద్ధిపొందింది.

సరియైన నాయకత్వంతో కార్మికవర్గశక్తుల్ని నిర్మాణాలలోకితెచ్చి బలపరుస్తూ, అంతిమయుద్ధానికి సంసిద్ధం కావడానికై చిన్నచిన్న పోరాటాలు జరిపిస్తూ, విప్లవకరమైన అగ్రపక్షాన్ని అంతకంతకీ నిర్మలినం చేస్తూ, ఒదుగుబాటుదారుల వైపునుంచి కార్మికవర్గాన్ని తమప్రక్కకి

ఆకర్షిస్తూ, నడచిన విప్లవానికి పూర్వంనాటి ఈ అభివృద్ధిక్రమంలోనే, బయలుదేరిన—ఎత్తుగడలకి సంబంధించిన ఎన్నో సమస్యల్ని — 1917 వరకూ బోల్షివిక్ పార్టీ సంపాదించిన అనుభవాల సహాయంతో "లెనిన్" ఎంతో చక్కగా పరిష్కరించేడు. అటుతరువాత తన అనుభవాన్ని కమ్యూనిస్టు ఇంటర్నేషనలుద్వారా వివిధదేశాలలోని కార్మికవర్గాలకి అందచేసేడు.

పార్టీకి—ప్రజాసామాన్యానికీ ఉండవలసిన సంబంధాలనుగూర్చి, ప్రజాసామాన్యాన్ని తనవేపుకి ఆకర్షించుకొనే విధానాన్నిగూర్చి, బయలుదేరిన ఎన్నో సమస్యలకి లెనిన్‌యొక్క ఈ అనుభవము, ఈ మార్గదర్శిత్వము, పరిష్కారవిధానం సూచిస్తున్నాయి. అంటే—ట్రేడ్ యూనియన్లకర్తవ్యం; ట్రేడ్‌యూనియనులతోనూ, తదితరశ్రామికవర్గసంస్థలతోనూ, పార్టీకి ఉండవలసిన సంబంధం; కార్మికులతో సమానంగావుండే ఇతరప్రజాసామాన్యంతో పార్టీకి ఉండవలిసిన సంబంధం; రహస్యమూ—బహిరంగమూనైన రెండుకార్యక్రమాలనీ జతచేయడం: బూర్జువాపార్లమెంట్లనీ—ఎన్నికలనీ— పార్లమెంటరీపద్ధతులమీద భ్రమ కలిగించడంకోసంగాక కార్మికవర్గవిప్లవోద్యమ ప్రచారానికీ, నిర్మాణానికీ ఉపయోగించుకోవలసిన పద్ధతి; చిన్నచిన్న పోరాటాలు, చిన్నచిన్న కోర్కెలు, (కార్మికవర్గవిప్లవోద్యమానికి ఫలితంగా ఈయబడేవి.) సంస్కరణాలు, ఆత్మరక్షణ చేసుకుంటూ వెనుకతగ్గవలసిన పద్ధతులు, మొదలయినవాని ఆవశ్యకత; ఒదుగుబాటుదనాన్ని ఎదిరించి పోరాడవలసిన పద్ధతులు; ఈలాంటివే ఎన్నోసమస్యలకి సరియైన సమాధానాలని ఇస్తున్నాయి.

విప్లవానికి పూర్వమే బయటపడి, ఆనాటి అభివృద్ధిక్రమంలో అధికప్రాముఖ్యత వహించిన—ఈ ఎత్తుగడలకు సంబంధించిన--సమస్యలలో అధికభాగం విప్లవసమయంలోను, విప్లవానంతర కాలంలోనూ, కూడా నూతన నూతన రూపాలలో ప్రత్యక్షం అవుతూనేవున్నాయి.

విప్లవం వచ్చేదాకానూ, విప్లవం వచ్చినాకనూ, ప్రజాపోరాటానికి నాయకత్వం వహించడం విషయంలో; రాజ్యాంగాధికారాన్ని జయించే టంతవరకు మెట్టుతరువాత మెట్టుగా ముందుకు పోవలసిన మార్గాన్ని నిర్ణయించడం విషయంలో; ఉపయోగించవలసిన యుక్తులు—ఎత్తుగడలకి సంబంధించిన మూలసూత్రాలు చాలాగంభీరమైనవే. వర్గశక్తుల పరస్పర సంబంధాలు; దేశంలోను, దేశంబయట గల పరిస్థితులు—బూర్జువావర్గం యొక్క బలము; దార్ఢ్యము; కార్మికవర్గముయొక్క సంసిద్ధత; మధ్య తరగతుల వైఖరి: సాధ్యమైనంతమంది ఎక్కువ జనసామాన్యాన్ని పోరాటంలోకి తీసుకువచ్చేటందుకుగల మార్గాలు—ఈయవలసిన హెచ్చరికల నిర్ణయం; పురాతనపాలకశక్తులు పరపతివి కోల్పోయి, విచ్చిపోవడానికి సిద్ధంగా వున్నపుడు—ప్రజాసామాన్యం పురాతనజీవితపద్ధతులలో అణిగి పడివుండడానికి నిరాకరిస్తూన్నపుడు—విప్లవంయొక్క స్థితిగతులు—; సరిగ్గా అంచనా వేసుకొని—క్రమంగా తీవ్రములయిన హెచ్చరికల్ని ఉపయోగిస్తూ, పోరాటంలో ఉత్తమపద్ధతుల నవలంబిస్తూ, ప్రజాసామాన్యాన్ని అధికాధికంగా పోరాటంలోనికి దింపుతూ, ముందుకుసాగి పోవలసిన పద్ధతిని గుర్తెరిగి—అంతిమయుద్ధం జరపవలసిన సమయాన్ని సరిగా నిర్ణయించుకొని, సాయుధవిప్లవానికి తయారీచేసి నాయకత్వం వహించడం—మొదలయినవాని విషయమై మార్క్స్—లెనినులు చెప్పే సిద్ధాంతాలకి—కార్యక్రమానికీగల బలం అంతా నాయకత్వం వహించి నడిపించవలసిన సమయంలో పరీక్షకి వస్తుంది.

ప్రభుత్వాధికారం స్వాధీనం చేసుకొన్నాక ఉపయోగించవలసిన యుక్తి—ప్రయుక్తులూ, ఎత్తుగడలు, ఏలాగ వుంటాయనే విషయం ఆనాటివరకు ఎవ్వరిచేతా ఎత్తుకోబడలేదు. 1917 తర్వాత లెనిన్ నాయకత్వమే ఈ విషయాల్ని సాధించింది.

ప్రాథమికావస్థలోనుంచి— ప్రభుత్వాధికారస్వీకరణంవరకూ గల శ్రామికవర్గ పోరాటంలోని ఈ వివిధదశలలో— సిద్ధాంత రంగంలోనూ,

కార్యరంగంలోనూ, కూడా మార్గదర్శిత్వం వహించిన లెనిన్ తన నాయకత్వాన్ని తరువాతివారికి వదిలిపెట్టి పోయేడు. అంతర్జాతీయకార్మిక వర్గం వీనిని గ్రహించి, జీర్ణం చేసుకోగలిగినప్పుడే విజయపథం సులువు అవుతుంది.

"కమ్యూనిస్టుఇంటర్నేషనలు" లో అతని నాయకత్వం మూర్తీభవించింది. 1919 లో లెనిన్ తన నాయకత్వాన "కమ్యూనిస్టుఇంటర్నేషనలును" స్థాపించేడు. ప్రపంచం అంతటా సోషలిస్టువిప్లవం విజయం పొందడానికై మార్గంచూపే మార్క్సు—లెనినుల సిద్ధాంతాలను ఆధారం చేసుకొని, సమ్మేళనమునొందిన విప్లవకరకార్మికవర్గముయొక్క పక్షముగా ఈ ఇంటర్నేషనలు సువిఖ్యాతం అయింది.

## నాలుగవ ప్రకరణం.

## "లెనిన్ ఉత్తరాధికారి: కమ్యూనిస్టు ఇంటర్నేషనలు."

ఈ నాటికప్పుడే "లెనిన్" చనిపోయి పదిఏళ్లు కావస్తూంది. (1933 నాటికి.)

అతని దృక్పథం— కార్యవిధానం— సరియైనవేనని ఈ పదిఏళ్లు ఎంతవరకు నిరూపించగలిగేయి ?

యుద్ధం తర్వాత మళ్ళీ కోల్కోగలమని కలలుగన్న బూర్జువా వర్గంయొక్క ఊహలన్నీ ఈ పదిఏళ్ళలోనూ భగ్నం అయిపోయేయి. వర్సెయిల్సు సంధినిర్ణయాలు ఒక్కటొక్కటే అతిక్రమింపబడ్డాయి. సామ్రాజ్యవాద విధానంలో పూర్వంకన్నా వైరుధ్యాలు బాగా పెరిగి పోయేయి. చరిత్రలో ఎక్కడా సాటిలేనంత తీవ్రము— దీర్ఘమునైన ఆర్థికమాంద్యం ఈ నాలుగేండ్లనుంచీ (1933 నాటికి) అభివృద్ధి పొందుతూంది. ఇంకో ప్రపంచయుద్ధం వస్తూందని అందరికీ స్పష్టం అయిపోయింది.

ప్రపంచయుద్ధంవలన—అంతర్యుద్ధంవలన ఆర్థికంగా కూలిపోయి, దుర్బలమైపోయిన సోవియటుయూనియను ఈ పదిఏళ్ళలోను అత్యద్భు

తంగా బలపడి ఆర్థికోన్నతిని పొందింది. ఏపెట్టుబడిదారీదేశంలోనూ ఆవేగము—తీవ్రత—అభివృద్ధి—చూడలేము. ఒకమూల ప్రతిపెట్టుబడిదారీ దేశమూ అంతకంతకి దిగనారిపోతూంటే ఒక్క—సోవియటు యూనియనులో మాత్రమే వస్తూత్పత్తి యుద్ధానికిపూర్వంకంటె మూడురెట్లు, పదేళ్ళక్రితంకంటె నాలుగురెట్లు, పెరిగింది. బ్రిటనును మూడోస్థానం లోకీ, జర్మనీని నాలుగో స్థానంలోకీ, లాగివేస్తూ, పారిశ్రామికదేశాలలో సోవియటుయూనియను రెండో స్థానం ఆక్రమించింది. సోవియటు యూనియనును—ప్రపంచవిప్లవాన్ని భవిష్యత్తులో ఎటువంటి భయంకర యుద్ధాలు ఎదురుచూస్తూన్నా, ఈ సాధనలు—ఇంతకంటేనూ మహత్తరమైన ఆ వైజ్ఞానికసాధనలు ఏనాటికీ మాసిపోజాలవు. భవిష్యత్ప్రపంచ వ్యవస్థకి ఈ సాధనలు--ఇతర వైజ్ఞానికసాధనలు అప్పుడే పునాదులు వేసివేసేయి.

ఈ పదిఏళ్ళలోనూ వర్గకలహం తీవ్రరూపం ధరించి బాగా ముందుకు సాగింది. యూరోపు--అమెరికాలలోమాత్రమేగాక ఏషియాలో కూడా విప్లవోద్యమం బాగా విజృంభించింది. విప్లవపోరాటాలు పెచ్చు పెరిగినకొలదీ బూర్జువాప్రజాతంత్రాలు శిధిలం అయిపోతున్నాయి. రెండవ ఇంటర్నేషనలు ఇంకా--ఇంకా పతనంపొంది ఫాసిజానికి లొంగి పోయింది. కూలిపోతూన్న పెట్టుబడిదారీతత్వాన్ని సంరక్షించడానికి ఆఖరు ప్రయత్నంగా అతిక్రూరములయిన ప్రతి--విప్లవవిధానమూ-- ఫాసిష్టుపద్ధతీ అవలంబించబడినాయి.

పెట్టుబడిదారీతత్వం అతిశీఘ్రంగా పతనావస్థకువచ్చి ప్రపంచవిప్లవం విజృంభించుతుందని లెనినే సూచించేడు. ఈసూచనలను కార్యరూపంలోకి తెచ్చిన ఈ పదిసంవత్సరాల పరిణామాన్నీ అతడు చూడలేకపోయేడు. ప్రపంచపరిస్థితులు ఇంతవిషమంగా తయారయి, అతని అవసరం ఇంత అధికంగా వున్నపుడు, ప్రపంచనాయకత్వం వహించడానికి ఆతడు లేకపోయేడు.

కాని, పోరాటాన్ని ముందుకు సాగించడానికి క్రమశిక్షితములయిన శక్తుల్నీ--నిర్మాణాల్నీ దిగవిడిచి మరిపోయేడు.

ఆదినుంచి అంతంవరకూ అతడెన్నడూ వ్యక్తిగతమైనహోదాలో నాయకత్వం నిర్వహించియుండలేదు. ఇదే అతని రాజకీయజీవితంలో గల విశేషం. ఏవ్యక్తికంటేనూగూడా గొప్పదయిన ఒకఉద్యమానికి బాధ్యతగల ప్రతినిధిగా మాత్రమే అతడు చైతన్యంతో ప్రవర్తించేడు. ఆ ఉద్యమం అతనికి పూర్వమూ వుంది. చనిపోయిన తర్వాతా నడుస్తూంది.

అంతర్జాతీయకార్మికవర్గంయొక్క--అంతర్జాతీయసోషలిస్టు విప్లవముయొక్క--ఈ ఉద్యమము సుమారు నూరేళ్ళక్రితం మార్క్సు—ఏంగిల్సులచేత స్థాపితమైన కమ్యూనిస్టుసంఘంతో ఆరంభం అయింది. అది మొదటిఇంటర్నేషనలుద్వారా మార్క్సు--ఏంగిల్సులు నాయకత్వంలోనే ఫురికొంది. యుద్ధానికి పూర్వంనాటి రెండవ ఇంటర్నేషనలులో అది బలపడింది. కార్మికవిప్లవశకంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనలుద్వారా "లెనిన్" దానిని బాగా అభివృద్ధిపరచి చాలా ఉన్నతస్థితికి తెచ్చేడు.

కమ్యూనిస్టుఇంటర్నేషనలే "లెనిన్" ఉత్తరాధికారి.

1901 లో ఇంకా ఆనాటికి ఇంటర్నేషనలు సోషలిస్టుసిద్ధాంతవేత్తగా పరిగణించబడుతూన్న "కాట్స్కీ" ఈలాగ వ్రాసేడు.

"విప్లవకేంద్రం పశ్చిమాన్నుంచి తూర్పుకి జరుగుతూంది. 19 వ శతాబ్దంయొక్క ప్రథమార్ధభాగంలో ఆ కేంద్రం ఫ్రాన్సులో కొంత కాలమూ-ఇంగ్లాండులో కొంతకాలమూ వుండేది. 1848 లో జర్మనీకూడా విప్లవకరములయిన జాతులతో చేరింది. నూతనశతాబ్దారంభంలో ఈవిప్లవకేంద్రం రష్యాకు మారిన దనుకొనేటందుకు సూచనలు కనిపిస్తూన్నాయి. పశ్చిమదేశాలనుంచి విప్లవతత్వాన్ని నేర్చుకొన్న రష్యాయే ఈనాడు విప్లవానికి పుట్టినిల్లయింది. తేజోవంతమైన రష్యను విప్లవాగ్ని మనఉద్యమంలో వ్యాపిస్తూన్న దుష్పాండిత్యాన్ని—నిర్వీర్యములైన రాజకీయవాసనల్ని

తరిమివేసి ఉత్తమమైన ఉత్సాహాన్ని—ఉత్తమాదర్శాలయెడల విపరీతమైన ఆసక్తినీ పుట్టించగలదు.........

రష్యాలో నేడు విప్లవవ్యతిరేకతకీ— నిరంకుశత్వానికీ తావులేదు. పరిస్థితులు నేడు బాగా తలక్రిందులైనాయి.........ఏమయితేనేం నేటి పోరాటం ఏనాడో ఒక నాడు ఆఖరుగాక తప్పదు. ఈపోరాటంలో మరణించిన అసంఖ్యాకులగు స్వార్థత్యాగుల రక్తపాతం వట్టినే పోదు. అది నాగరికప్రపంచ మందంతటా సోషలిస్టు బీజాల్ని మొలకలెత్తించి అతివేగంగా వృద్ధిలోకి తెస్తుంది. 1848 లో స్లావుజాతి అప్పుడప్పుడే మేల్కొంటూన్న ప్రజోద్యమాల్ని నాశనం చేసింది. వారే నేడు, విప్లవారంభాలకి చేయూతనిచ్చి నూతన వసంతారంభమునందలి ఆనందం కలుగ చేస్తారు."

("స్లావుజాతి: విప్లవం"—కాట్స్కీ—"లెఫ్ట్‌కమ్యూనిజం"—మొదటి ప్రకరణంలో లెనిన్, దీనిని ఉదాహరించేడు.)

ఆనాడు ఈమాటల యాథార్థ్యం గుర్తించబడకపోయినా ఈనాటి కవి మన అనుభవంలోకి వస్తున్నాయి.

1917 నాటి బోల్షివిక్ విప్లవంతో నూతనశకం ఆరంభంఅయింది. అదే సోషలిస్టువిప్లవశకం. అందుచేతనే బోల్షివిక్ విప్లవం—రష్యను విప్లవంగా గాక, ప్రపంచవిప్లవముగానే ప్రఖ్యాతిని పొందింది. "లెనిన్" రష్యనువిప్లవనాయకుడు కాదు. అంతర్జాతీయ విప్లవోద్యమనాయకుడు.

ఆ అంతర్జాతీయ విప్లవోద్యమనాయకత్వమే కమ్యూనిస్టుఇంటర్నేషనలులో ప్రతిబింబించింది.

1914 లో రెండవ ఇంటర్నేషనలు కూలిపోగానే "లెనిన్" కమ్యూనిస్టుఇంటర్నేషనలుయొక్క (మూడవ—ఇంటర్నేషనలు) అవసరాన్నిగూర్చి తలపోసేడు. ఆనాడే రెండవ—ఇంటర్నేషనలుకీ దానికీ ఉండవలసిన భేదాన్నిగూర్చీ, దాని కర్తవ్యాన్నిగూర్చీ ఈలాగ వ్రాసేడు.

"19 వ శతాబ్దంలోని ఆఖరు ముప్ఫైఏళ్ళలోనూ, 20 వ శతాబ్దారంభంలోనూ, పెట్టుబడిదారీతత్వం తీవ్రంగా అభివృద్ధి చెందింది. పెట్టుబడిదారుల దాస్యంలో

గడిచిన అతిదీర్ఘమైన ఆ "ప్రశాంత" యుగంలో శ్రామికవర్గాన్ని ప్రాథమికనిర్మాణాలలోకి తెచ్చి తయారుచేయడంలో రెండవ-ఇంటర్నేషనలు పూర్తిగా పనిచేసింది....

"పెట్టుబడిదారీప్రభుత్వాలమీద విప్లవాక్రమణలు జరపడానికీ, అన్ని దేశాలలోను బూర్జువావర్గంతో అంతర్యుద్ధంలో తలపడడానికీ, రాజకీయాధికారం స్వాధీనం చేసుకోడానికీ, సోషలిజానికి జయం లభింపచేయడానికీ, శ్రామికవర్గశక్తుల్ని ఏకం చేసి నడిపించవలసిన బాధ్యత మూడవ-ఇంటర్నేషనలుపై పడింది."

("సోషలిస్టుఇంటర్నేషనలుయొక్క స్థితి-కర్తవ్యము": నవంబరు-1914)

కమ్యూనిస్టుఇంటర్నేషనలు 1919 లో స్థాపించబడింది. 1919-21 ఆ మధ్య జరిగిన మూడు సాంవత్సరిక సమావేశాలలోను "లెనిన్" చాలా అధికంగా పాల్గొని పనిఅంతా తానే నిర్వహించేడు. నిర్మాణంవిషయంలో, వైఖరిని నిర్ణయించడం విషంలో ప్రధానమైన పత్రాలు వ్రాయడం విషయంలో అతడు బాగా శ్రద్ధపూని పనిచేసేడు. 1922 లో జరిగిన నాల్గవ సమావేశంలోకూడా అతడు పాల్గొన్నా పనిమాత్రం మితంగానే జరపగలిగేడు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనలుయొక్క భారతరమైన బాధ్యతలను గూర్చిగాని; సంపూర్ణవిజయానికి ఆవసరమైన శక్తిని సంపాదించేలోపున గడువవలసిన దీర్ఘము-యాతనపూరితమునైన మార్గాన్ని గురించిగాని; అతడెన్నడూ పొరపాటు అంచనాలు వేసుకోలేదు. మూడవకాంగ్రెసు పూర్తి అయినాక 1921 ఆగస్టులో అతడు వ్రాసినవిషయం గమనించండి.

"బాగా బలిష్ఠంగాకపోయినా, నిర్మాణంలో లోపాలున్నా ప్రపంచమందంతటా మన కమ్యూనిస్టుబలగం ఏర్పడింది. ఈ విషయాల్ని మరచినా, లేక దాచి పెట్టడానికి ప్రయత్నించినా, మన ఆదర్శాలకి అపాయం తెచ్చిపెట్టినవాళ్ళం అవుతాము. ఈ బలగాన్ని సుసంఘటితంచేసి, క్రమశిక్షణను ఈయవలసిన బాధ్యత మనది. అన్నివిధాలయిన ఉద్యమాలలోను, పోరాటాలలోను వారికి తరిఫీదు నీయాలి. ఎదిరించడం, నేర్పుగా తప్పుకొనడం బోధించాలి. ప్రతిఉద్యమముయొక్క అనుభ

వాన్ని గ్రహించడంలో మంచినేర్పు అలవడేటట్లు చేయాలి. విసుగు పుట్టించేది అయినా, ఈ కఠినతరమైన శిక్షణకు లోనుగాకపోతే విజయం లభించదు.

(జర్మను కమ్యూనిస్టుపార్టీకి వ్రాసినజాబు—అక్టోబరు 1921.)

ఎన్నోమార్లు నెగ్గుతూ—ఓడుతూ, కొన్నికొన్ని దేశాలలోని ప్రతి—విప్లవకారులచేత తాత్కాలికంగా అపజయాలు పొందుతూ, ఎంతో కాలంవరకు జరుపుతూనే వుండవలసిన గొప్పపోరాటం ఇంకాముందు ఉందని "లెనిన్" ఎరుగును.

"బూర్జువావర్గానికి బోల్షివిజంలో కనపడేదల్లా ఒకభాగమే; విప్లవం-దౌర్జన్యం-భయోత్పాతం. అందుచేత వారు ఆభాగంలోనే ఎదుర్కొనడానికి సంసిద్ధం అవుతారు. అక్కడక్కడ ఏవో కొన్ని దేశాలలో ఏకొంకొద్ది-గొప్పకాలంవరకు వాళ్ళు విజయం పొందవచ్చును. కాని, ఈప్రయత్నాలలో బూర్జువావర్గం పూర్తిగా జయం పొందగలదని భయపడవలసిన పనిలేదు, సామాజికజీవితంలోని అన్నివైపులనుంచీకూడా "కమ్యూనిజం" మొలకలెత్తుతుంది. దానిబీజాలు అన్నిచోట్లా వున్నాయి. ఇది "అంటువ్యాధి"లాగ (బూర్జువావర్గమూ వారి పోలీసులూ అతిప్రియంగా ఉచ్చరించే శబ్దం.) సామాజికజీవితం అంతటిలోనూ వ్యాపించివుంది. ఒకమార్గం మూసివేస్తే ఈ "అంటురోగం" మరొక, అనుకోని, దారిని బయటికి వస్తుంది. జీవితమే దానిని దృఢపరుస్తూంది. బూర్జువావర్గం గోలపెట్టనీ; మతిచెడి వెర్రిపనులు చేయనీ; తెలివి తక్కువగా ప్రవర్తించనీ; తనకున్న కసినంతనీ బోల్షివికులమీద తీర్చుకోనీ; ఇండియా-హంగరీ-జర్మనీ మొదలయిన దేశాలలో ఇదివరకు పుట్టినవారినీ-ఇకముందు పుట్టబోయేవారినీ-బోల్షివికుల్ని వందలు-వేలు-లక్షలుగా మారణహోమం చేయనీ; ఇది ఆగదు. నశించిపోయితీరుతాయని చరిత్రచేత శపింపబడిన ఇతర వర్గాలలాగే బూర్జువావర్గం కూడా పనిచేస్తుంది. భవిష్యత్తు తమదేననే విషయం కమ్యూనిస్టులు మరచిపోకూడదు. కనుకనే బూర్జువావర్గం చూపుతూన్న పిచ్చిఘోరణిని-ఎదిరించడానికై మహత్తరమైన ఈవిప్లవోద్యమంలో గాఢాసక్తితో-శాంతాన్నీ-బుద్ధిచాతుర్యాన్నీ జతపరచాలి. మనం ఆ పని చేయగలం కూడాను. ఏదేశంలోనైనాసరే, ఏపరిస్థితులనైనాసరే, కమ్యూనిజం వ్యాపించి తీరుతుంది. దానిని ఆగివేయడానికికూడా సాధ్యంకానంత లోతుగా అది వ్రేళ్ళుబారింది. దానిని నిర్మూలించాలనే

ప్రయత్నాలు దానిని బలహీనమూ చేయలేవు. నిర్వీర్యమూ చేయలేవు. పైపెచ్చు దాని బలాధిక్యతకి తోడ్పడుతాయి.

(Left Communism. పే. 10.)

"జీవితమే దానిని ఋజువుచేస్తుంది."

ప్రధానమైన ఈ అభిప్రాయంలోనే సోషలిష్టుప్రపంచ విప్లవం జయం పొందితీరుతుందని "లెనిన్" కు గల విస్వాసం బహిరంగం అవుతూంది. జర్మనీవగైరా దేశాలలో నేడు ఫాసిజం ప్రభుత్వాధికారాన్ని తాత్కాలికంగా నడిపిస్తూంది. ఈవిధంగా ఎన్నిమార్లు ఎన్ని ఒడిదుట్లు వచ్చినా—తాత్కాలికములయిన అపజయాలు కలిగినా—అవన్నీ విప్లవం తీవ్రతరము—గంభీరము అయ్యేటందుకే తోడ్పడి విజయాన్ని లభింప చేస్తాయి.

"సామ్రాజ్యవాదం- సామ్రాజ్యవాదయుద్ధాలు నిర్మించిన అంధకారంలోంచి మానవజాతికి వెలుగు చూపగలది కార్మికవర్గం నడిపించే సోషలిస్టువిప్లవం మాత్రమే. ఎటువంటి కష్టాలురానీ; సర్వసాధారణాలు-తాత్కాలికాలునైన అపజయాలెన్ని కలగనీ; ప్రతివిప్లవ తరంగాలనెన్నింటి నెదిరించవలసిరానీ; కార్మికవర్గానికి విజయంకలుగకతప్పదు."

(పార్టీకార్యక్రమంలో చేయవలసిన మార్పుల్ని గురించి తీర్మానం ఏప్రియలు—1917.)

ఏవో కొద్దిహక్కులకోసంగాక, మానవజాతికే ఒక నూతనశకం ప్రసాదించడంకోసం, "లెనిన్" తలపెట్టేడు. కాని, ఆ మహాత్కార్యం పూర్తిఅయ్యేదాకా అతడు జీవించలేకపోయేడు. ప్రపంచ పరిస్థితులు అంతకంతకి క్లిష్టం అవుతూ, తొందరకలిగిస్తూన్న ఈ సమయంలో పోరాటాన్ని ముందుకు గొనిపోయి, విజయం పొందించవలసిన బాధ్యత కమ్యూనిస్టు ఇంటర్నేషనలుద్వారా "లెనిన్" తరువాతి వారిమీద పడింది.